॥ శ్రీహరిః ॥

# మధుర గాథలు

గీతాప్రెస్ – మూలవ్యవస్థాపకుడు
జయదయాల్‌జీ గోయందకా

అనువాదం
పురాణపండ బాలాన్నపూర్ణ, ఎమ్.ఏ.,

పరిష్కర్త – సంపాదకుడు
సందెపూడి రామచంద్రరావు, ఎమ్.ఏ.,


ప్రచురణ
గీతా ప్రెస్, గోరఖ్‌పూర్
1996

चो० कं० ( तेलगू ) १—

# నివేదన

బాలబాలికలలో పఠనాసక్తిని పెంచుతూ, పదవగాహన కలిగిస్తూ, మనోహరమైన గాథలు గల పుస్తకాలు అసంఖ్యాకంగా రావాలి. చిన్నచిన్న కథలలో వివిధ విషయ జ్ఞానంతోబాటు, జీవితాన్ని పవిత్రం, తేజోవంతం చేసే ప్రబోధాలు ప్రేరణలు లభించాలి. సరళమైన భాషతో లక్ష్యసాధనకై యీ పుస్తకప్రచురణ కొనసాగుతూన్నది. ఇందులో 32 గాథలున్నాయి. భాష, భావం, శైలి, కథనం పిల్లలమానసిక స్థాయిననుసరించి రచించబడ్డాయి. నీతి ప్రబోధాలు, ప్రేరణ ఇవ్వగల ఈ చిన్నారుల కథలు పెద్దలు కూడా చదవదగినవి. వీనిని చదువుటవలన బాలబాలికలకు మేలు కలుగుతుందని ఆశిస్తూ ...

సంపాదకుడు

# విషయసూచిక



----oOo----

# 1. భగవంతునిపై భారం

అది వర్షఋతువు, సాయంసమయమయింది. ఆకాశమంతా మేఘాలు కమ్ముకున్నాయి. ఓ వేపచెట్టుమీద ఎన్నో కాకులు కూర్చుని ఉన్నాయి. అవి మాటిమాటికీ "కావ్ కావ్" అంటూ పరస్పరం కలహించుకుంటున్నాయి. అప్పుడే ఓ మైనావచ్చి అదే వేపచెట్టు కొమ్మమీద కూర్చుంది. మైనాను చూస్తూనే కాకులు దాని మీద విరుచుకు పడ్డాయి.

పాపం మైనా అంది "మేఘాలు దట్టంగా కమ్ముకున్నాయి. దానితో యీ రోజు శీఘ్రంగానే అంధకారం వ్యాపించింది. నేను నా గూటిని మరచిపోయాను. ఈ రాత్రికి నన్నిక్కడ కూర్చోనివ్వండి".

"వీల్లేదు ఈ చెట్టుమాది. నువ్విక్కడనుండి పారిపో" అన్నాయి కాకులు.

చెట్లన్నీ పరమాత్మవి. ఈ చలిలో వర్షంకురిసి వడగళ్ళు పడితే భగవంతుడే మనందరి ప్రాణాలను రక్షించగలడు. నేను చిన్నదాన్ని, మీ సోదరిని. నాపై మీరు దయచూపండి. నన్ను కూడ యిక్కడ కూర్చోనివ్వండి" అంది మైనా.

అదివిని కాకులు– "మాకు నీలాంటి చెల్లెలు అక్కరలేదు. నువ్వు అధికంగా భగవన్నామాన్ని స్మరిస్తున్నావు. అయితే దేవుడి మీద భారం వేసి ఎందుకు పోలేవు? నువ్వు వెళ్ళకపోతే మేమందరం నిన్ను చంపేస్తాము", అన్నాయి.

కాకులకు కలహించడమే స్వభావం. సాయంకాలం అవి చెట్టుమీద కూర్చోగానే కలహించకుండ ఉండలేవు. పరస్పరం కొట్టుకుంటూ ఉంటాయి. "కావ్ కావ్" అని అరుస్తూ ఉంటాయికూడ. ఏ కాకి యే కొమ్మ మీద రాత్రి కూర్చుంటుందో నిశ్చయాత్మకంగా ఎవరూ చెప్పలేరు కూడ. అవి తమలో తాము కొట్టుకోవడమే కాక యే పక్షినీ తమ చెట్టుమీద కూర్చోనీయవు. అవి

పరస్పరం కలహించుకోవడం మానివేసి మైనా మీద విరుచుకుపడ్డాయి.

"కావ్ కావ్" అంటూ కాకులు తన మీదకు విరుచుకు రావడం చూసి పాపం మైనా అక్కడనుండి ఎగిరిపోయి దగ్గరలోనే ఉన్న మామిడి చెట్టుపై వాలింది.

రాత్రి తుపాను వచ్చింది. మేఘాలు గర్జించాయి. వడగళ్ళు పడసాగాయి. బంగాళాదుంపలవంటి పెద్దపెద్ద వడగళ్ళుపడసాగాయి. తుపాకి గుళ్ళవలె భయంకర శబ్దాలు చేస్తూ అవి పడుతున్నాయి. కాకులు 'కావ్ కావ్' మంటూ అరచాయి. ఇక్కడనుండి అక్కడకు కొద్దిగా ఎగిరాయి. కాని అన్నిటికన్నీ వడగళ్ళ దెబ్బలకు గాయపడి నేలకూలాయి. అందులో చాలా కాకులు మరణించాయి.

మైనా కూర్చున్న మామిడిచెట్టు కొమ్మలలో లావైన కొమ్మ తుపానుకు విరిగిపోయింది. కొమ్మ లోపలిభాగం పుచ్చిపోయి డొల్ల అయిపోయింది. కొమ్మ విరిగినచోట దాని మూలంలో ఓ తొర్ర ఏర్పడింది. ఆ చిన్న మైనా ఆ తొర్రలో దూరింది. దానికి వడగళ్ళు ఏమీ తగలలేదు.

తూర్పు తెల్లవారింది. రెండు ఘడియలు గడవడంతో మిలమిల ప్రకాశంతో ఎండవచ్చింది. మైనా తొర్రలో నుండి బయటకు వచ్చింది. రెక్కలు విప్పి మధురంగా కూస్తూ భగవంతునికి ప్రణమిల్లి అది ఎగిరిపోయింది.

వడగళ్ళదెబ్బకు గాయపడి నేలకూలిన కాకులు ఎగిరిపోతున్న మైనాను చూసి అతి కష్టంమీద అన్నాయి, మైనా, సోదరీ! రాత్రంతా నువ్వెక్కడున్నావు? వడగళ్ళ దెబ్బలనుండి నిన్నెవరు కాపాడారు?

మైనా సమాధానమిచ్చింది "నేను మామిడిచెట్టు తొర్రలో ఒంటరిగా కూర్చుని భగవత్ప్రార్థన చేస్తున్నాను. దుఃఖంలో ఉన్న అసహాయ జీవులను భగవంతుడుగాక రక్షించగలవారెవరు?"

కాని భగవంతుడు కేవలం వడగళ్ళనుండియే కాదు, కేవలం మైనానే కాదు రక్షించేది, భగవంతునిపై భారంవేసిన వారందరినీ, అతణ్ణి స్మరించిన వారందరినీ భగవంతుడు సర్వాపదలనుండి రక్షించి సహకరిస్తాడు.

-----oOo-----

## 2. అధమ బాలకుడు

అది వర్షఋతువు. చెరువు పూర్తిగా నీళ్ళతో నిండివుంది. కప్పలు ఒడ్డున కూర్చుని ఏకకంఠంతో బెకబెక మంటున్నాయి. పిల్లలు కొందరు స్నానాలు చెయ్యసాగారు. నీళ్ళల్లోకిదూకి వారు ఈదసాగారు. అందులో ఒకడు ఓ రాయిని తీసి ఓ కప్పను గట్టిగా కొట్టాడు. కప్పదూకి నీళ్ళలోకి వెళ్ళిపోయింది. ఆ కప్ప దూకడం చూసిన ఆ కుర్రవానికి బలేమజాగా వుంది. పదేపదే వాడు కప్పల మీదకు రాళ్ళు వేస్తూ అవి దూకుతుంటే చూసి వినోదిస్తున్నాడు.

రాళ్ళు తగలడం వల్ల పాపం ఆ కప్పలకు దెబ్బలు తగులుతున్నాయి. వాటికి మనుష్యభాషే వచ్చివుంటే ఆ పిల్లవాణ్ణి అర్థించి అయినా ఉండేవి, లేదా దూషించి అయినా వుండేవి. పాపం అవి ఏమి చేస్తాయి. దెబ్బలు తగులుతున్నాయి, ప్రాణరక్షణార్థం అవి నీళ్ళలోకి దూకుతున్నాయి. ఆ పీడను సహించడం కన్న వాటికి వేరే ఉపాయం ఏదీ కానరావడం లేదు.

ఆ రీతిగా కప్పలమీద రాళ్ళు విసరడం, కీటకాదులను బాధించడం, వాటి ప్రాణాలు తీయడం మహాపాపమని ఆ పిల్లవాడికి తెలియదు. పాపంచేసేవాడు మహాదుఃఖాన్ని అనుభవించవలసి వస్తుంది. మరణానంతరం అట్టివాణ్ణి యమదూతలు బంధించి నరకంలోకి తీసుకుపోతారు. అక్కడ వాడు మహాకష్టాలు అనుభవించవలసి వస్తుంది. అధమ బాలకుడికి కప్పలపై రాళ్ళు విసరడం ఆటగా కనిపించింది. వాడు

పదేపదే వాటిని రాళ్ళతో కొడుతూనే వచ్చాడు.

"వీణ్ణి బంధించి తీసుకుపోండి" అన్న పలుకులు విన్న ఆ బాలుడు వెను తిరిగి చూశాడు. ముగ్గురు యమదూతలు నిలబడి వుండడం గమనించాడు. నల్లని యమకింకరులు, ఎఱ్ఱటి కళ్ళు, పెద్దపెద్ద దంతాలు, వంకర ముక్కులు చేతులలో పెద్దపెద్ద కర్రలు, పాశాలు, వారిని చూస్తూనే ఆ పిల్లవాడు భయపడిపోయాడు. వాడు సహచరులను పిలిచాడు. కానీ అక్కడెవ్వరూ లేరు. ఆటలలో వారు నిమగ్నమైపోయారు, స్నానంచేసి వెళ్ళిపోయారు.

"వీణ్ణి పట్టుకోండి" ఓ యమదూత మిగిలిన వారితో పలికాడు.

"వీడు పేడపురుగు కంటే అసహ్యమైనవాడు" రెండవ యమదూత అసహ్యించుకుంటూ పట్టుకోవడానికి ఒప్పుకోలేదు.

"నేను వీణ్ణి స్పృశించలేను, వీడు మహానీచుడు. నా చేతులు మైలపడిపోతాయి" మూడవ యమదూత అన్నాడు.

అయితే యీ ఉచ్చులో బంధించి యీడ్చుకునిపోదాము. అన్నాడు మొదటివాడు. ఆ పిల్లవాడు యిదంతా వింటున్నాడు. వాడి ప్రాణాలు పోతున్నట్లనిపించింది. సాహసించి ప్రశ్నించాడు. "నన్ను ఎక్కడకు తీసుకుపోతారు".

నరకంలోనికి, అక్కడ పాపులందరూ సజీవంగానే కాగే నూనెలో వేయించబడతారు పకోడీలవలె, ఓ యమదూత గర్జిస్తూ అన్నాడు. "పకోడీల వలెనా?" పిల్లవానికి తల్లి పకోడీలు వేయించడం జ్ఞాపకానికి వచ్చింది, బాబోయ్! నేను పకోడిలా వేయించబడిపోతానా?

"నేను మీకు ఏమి అపకారం చేశాను? నన్ను విడిచి పెట్టండి", గిలగిల లాడుతూ బాలుడు ప్రార్థించాడు.

నువ్వు పాపివి, మహా అధముడవు. ఇంక ఎన్నడూ పాపం చేయనంటే విడిచి పెడతాము. యమదూతలలో పెద్దవాడన్నాడు.

నేను శపథం చేస్తున్నాను. నేనెన్నడూ పాపం చెయ్యను. బాలుడు ఆలోచించకుండానే రెండు చెవులూ పట్టుకుని ప్రతిజ్ఞ చేశాడు. యమదూతలు వెంటనే మాయమైపోయారు. పిల్లవాడు పరుగుపరుగున ఇల్లు చేరాడు. అతడు జరిగినదంతా తల్లికి చెప్పి అడిగాడు అమ్మా! నేను చేసిన పాపం ఏమిటి?"

"నాయనా! ఏ పాపం ఎరుగని కప్పలని నువ్వు పదేపదే కొడుతూ వచ్చావు. నిరపరాధులకు కష్టం కలిగించడమే మహాపాపం" అంది తల్లి.

"పరపీడనం కంటె అధమ కార్యం లేదు "

శ్లో ॥ అష్టాదశ పురాణేషు వ్యాసస్య వచన ద్వయం
పరోపకారః పుణ్యాయ పాపాయ పరపీడనమ్ ॥

----oOo----

# 3. యథాతథం

గుఱ్ఱానికి, గేదెకు మధ్య యుద్ధం జరిగింది. రెండూ ఒకే అడవిలో ఉంటున్నాయి. దగ్గరదగ్గరగానే మేస్తుంటాయి. ఒకే దారిలో పోయి ఒకే సెలయేటిలోని నీటిని త్రాగుతుంటాయి. ఓ రోజున ఆ రెండూ పోట్లాడుకున్నాయి. గేదె కొమ్ములతో పొడిచి గుఱ్ఱాన్ని సగం చచ్చేటట్లు చేసింది.

గేదెతో పోరాడి గెలవడం కష్టమని తలచి గుఱ్ఱం అక్కడనుండి పారిపోయింది. అది మానవునిచేరి తనకు సహకరించమని ప్రార్థించింది.

"గేదెకు పెద్ద పెద్ద కొమ్ములున్నాయి. పైగా అది చాలా బలం కలది. దానిని నేనెలా గెలవగలను?" అని మానవుడు ప్రశ్నించాడు. గుఱ్ఱం నచ్చచెప్పింది "నువ్వు నా వీపు మీద కూర్చో, లావైన ఓ కఱ్ఱను తీసుకో, నేను వేగంగా పరుగుపెడుతుంటాను. కఱ్ఱతో నువ్వు గేదెను బాదుతూ సగం చచ్చేలా కొట్టి దానిని త్రాటితో బంధించు".

"నేను దానిని బంధించి ఏం చేసుకుంటాను?" మానవుడు ప్రశ్నించాడు.

"గేదె చక్కటి తియ్యటి పాలు ఇస్తుంది. వాటిని నువ్వు త్రాగవచ్చు" నని గుఱ్ఱం బదులు చెప్పింది.

మానవుడు గుఱ్ఱం మాటలను అంగీకరించాడు. దెబ్బలు తినితిని పాపం గేదె నేలకూలేసరికి మానవుడు దానిని బంధించాడు. తనపని అయిన తరువాత గుఱ్ఱం అంది, "నరుడా! ఇక నువ్వు నన్ను విడిచిపెట్టు నేను మేయడానికి వెళ్ళాలి".

మానవుడు గట్టిగా నవ్వుతూ– "నేను నిన్నుకూడ బంధిస్తున్నాను. స్వారీచేయడానికి నువ్వు పనికివస్తావని నాకు తెలియదు. నేను గేదెపాలు

త్రాగి నీపై ఎక్కి స్వారీ చేస్తాను", అన్నాడు. గుఱ్ఱం అధికంగా విచారించింది. పశ్చాత్తాపపడింది. ఏం లాభం? జరుగవలసింది జరిగిపోయింది. గేదె విషయంలో అది వ్యవహరించినట్లే తన విషయంలోనూ ఫలితాన్ని పొందినది.

చేసుకున్నవానికి చేసుకున్నంత మహాదేవ!

-----oOo-----

## 4. స్వాతంత్ర్య సుఖం

ఓ నాడు ఒక ఒంటె తన యజమాని బంధంనుండి తప్పించుకొని పశ్చిమంగా పారిపోసాగింది. దారిలో ఓ నది అడ్డం వచ్చేవరకూ అది పరుగెత్తింది. ఇక ముందుకు పరుగుతీసే దారి లేకపోయింది. అది దారిలో పచ్చపచ్చటి పొలాలనూ, దట్టమైన పొదలనూ, సాంద్రమైన వేపచెట్లనూ విడనాడి వచ్చేసింది. కావాలనుకుంటే అది తన పొడవైన మెడను పైకెత్తి ఆకులను తినేది. కాని, అది అక్కడనుండి బహుదూరం వచ్చేసింది.

ముందు విశాలమైన గంభీరమైన సెలయేరు తీవ్రవేగంతో ప్రవహిస్తున్నది. వెనుకవైపు ఎత్తైన దిబ్బ వుంది. రెండు వైపులా బహుదూరం వరకు యిసుక తప్ప మరేమి కానరావడం లేదు. ఎక్కడా నామమాత్రానికి కూడ పచ్చదనం కనిపించలేదు. పాపం ఒంటె అక్కడకు వచ్చి ఆగిపోయింది. అలసి పోవడంతో కూర్చునిపోయింది. అది భయంతో ఏలాంటి శబ్దము చేయలేకపోతున్నది. ఎక్కడ తన యజమాని వచ్చి బంధిస్తాడేమో నన్నభయం. దానికి బాగా ఆకలివేస్తున్నది కాని అక్కడ నీళ్ళు తప్ప మరేమీ లేవు. అది వివశ అయిపోయింది.

రెండు మూడు రోజులు గడచిపోయాయి. ఆకలితో ఒంటె సగం చచ్చినదానిలా తయారయింది. అదే సమయంలో అక్కడకు ఓ కాకివచ్చింది. ఒంటె స్థితిని చూసి దానికి దయకలిగింది. ఒంటెకేసి చూస్తూ

అది యిలా పలికింది-"సోదరా! నేను ఎగురు తుంటాను. నువ్వు నా వెనకనే రా. నిన్ను నేను పచ్చటి పొలాలవరకూ తీసుకువెడతాను".

ఒంటె మహానందపడింది. అది కాకికి ధన్యవాదాలు చెప్పింది. దానితో వెళ్ళడానికి సిద్ధపడింది. అదే సమయంలో దానికి ఏదో జ్ఞాపకం రాగా ప్రశ్నించింది "సోదరా! ఆ పొలాల్లోకి మనుష్యులెన్నడూ రారు కదా?"

కాకి నవ్వింది. "మేల్మేలు. పచ్చటి పొలాలు ఎక్కడైనా మనుష్యరహితంగా వుంటాయా?"

"అయితే నేనిక్కడే సుఖంగా ఉన్నాను" ఖిన్నవదనంతో ఒంటె సమాధానం యిచ్చింది.

"ఇక్కడైతే నువ్వు ఆకలితో చచ్చిపోతావు". కాకి నచ్చ చెప్పబోయింది.

"ఇక్కడ ఎవరూ బంధించి రాత్రింబవళ్ళు పీడించరుకదా? ఒంటె సంతోషంగా గర్వంగా సమాధానం యిచ్చింది. యథార్థమిదే కదా.

పరాధీనులు స్వప్నమందును సుఖించరు.

----oOo----

## 5. దయామహిమ

ఓ బోయవాడు ఉన్నాడు. వాడు పక్షుల్ని పట్టుకుని వాటిని అమ్మి పొట్టపోసుకుంటాడు. వాడి వృత్తి అంత మాత్రమే. పక్షులను అమ్మగా వచ్చే ద్రవ్యంతో వాడు కుటుంబాన్ని పోషించుకుంటాడు.

ఓ నాడు ఆ బోయవాడు తన దుప్పటిని ఓ చెట్టుక్రింద పరచి తన పెద్ద వెదురుకర్రను తీసుకుని ఏదైనా పక్షి చెట్టుమీదకు వస్తుందేమోనని నిరీక్షించసాగాడు. అంతలో తీతువుపిట్ట ఒకటి ఆర్తనాదం చేసుకుంటూ వచ్చి ఆ బోయవాడు పరచిన దుప్పటి క్రింద దూరి తలదాచుకుంది.

తీతువును ఎవరూ పెంచుకోవడానికి కొనుక్కోరు. బోయవాడు దుప్పటిలో నుండి తీతువును పారద్రోలాలనుకున్నాడు. అదే సమయంలో పైనుండి ఎగురుతూ ఓ డేగ కనిపించింది.

భక్షించాలనియే డేగవస్తున్నదనీ అందులకే ఆ తీతువుపిట్ట ప్రాణభీతితో తనదుప్పటిలో దాగినదని బోయవాడు గ్రహించాడు. ఆ చిన్నపిట్టమీద కూడ వాడికి దయకలిగింది. రాళ్ళువిసిరి వాడు డేగను పారద్రోలగా దుప్పటి నుండి ఆపిట్ట స్వేచ్ఛగా వెళ్ళిపోయింది.

కాలం గిరగిర తిరిగిపోగా కొన్నాళ్ళకు ఆ బోయవాడు జబ్బుపడి మరణించాడు. యమకింకరులు వాణ్ణితీసుకుని యమలోకం చేరారు. ఆ లోకంలో ప్రజ్జ్వలిత జ్వాలలు భయంకరంగా కనిపిస్తున్నాయి. ఒకచోట పెద్దపెద్ద పెనాలలో నూనె సలసల మరుగుతున్నది. పాపాత్ములను యమకింకరులు అగ్నిలో వేయిస్తున్నారు. సలసల మరిగే నూనెలో పడవేస్తూన్నారు. ఆ యమకింకరులు పాపులలో కొందరిని కొరడాలతో కొడుతున్నారు. గొడ్డళ్ళతో నరుకుతున్నారు. వర్ణనాతీతంగా వారిని శిక్షిస్తున్నారు. బోయవాడు అక్కడ అడుగు పెట్టగానే అసంఖ్యాకంగా పక్షులు వచ్చి– "వీడు నిరపరాధులమైన మమ్మల్ని వలలోవేసి బంధించి అమ్మివేశాడు. మేమువీడి కళ్ళను పొడిచి వేస్తాము. పొడిచి పొడిచి వీడి

మాంసాన్ని భక్షిస్తాము", అన్నాయి.

పాపం బోయవాడు భయంతో గడగడ వణికిపోసాగాడు. అదే సమయంలో అక్కడకు తీతువు వచ్చి చేతులు కట్టుకుని యమధర్మరాజుతో "ప్రభూ! ఇతడు నా ప్రాణాలను కాపాడాడు. ఇతణ్ణి మీరు క్షమించండి" అని అర్థించింది.

"కింకరులారా! వీడు మహాపాపి పక్షులన్నీ వీణ్ణి పొడుస్తాయి. తరువాత నా సేవకులు వీణ్ణి గొడ్డళ్ళతో నరికి దగ్ధం చేస్తారు. కానీ యీ చిన్నపక్షి వీణ్ణి రక్షించాలని వచ్చిందే, వీడు ఓ సారి యీ పిట్టమీద దయ చూపించాడు. కనుక వీణ్ణి మరల భూతలానికి పంపివేసి ఓ సంవత్సరం బ్రతికే అవకాశం యివ్వండి" అని యమధర్మరాజు పలికాడు.

యమదూతలు బోయవాని జీవాన్ని వాని యింటి దగ్గరకు తీసుకు వచ్చేసరికి వాని బంధుబాంధవులు వాని శవాన్ని స్మశానానికి తీసుకుపోయి చితిమీద పెట్టి సంసిద్ధంగా ఉన్నారు. అందరికందరూ ఏడుస్తుండగానే బోయవాడు బ్రతికి కదలసాగాడు. వాని బంధుబాంధవులు మహానంద పరవశులయ్యారు. అందరూ స్వగృహాలకు మరలివచ్చారు.

బోయవానికి యమరాజు పలుకులు స్మృతిలో ఉన్నాయి. వాడు పక్షులను పట్టుకోవడం మానివేశాడు. తన అన్నదమ్ముల వారిని కూడ ఆపని చేయకుండా నిరోధించాడు. వాడు కూలిపని చేసుకోసాగాడు. నాటినుండి వాడు ఉదయ సంధ్యా సమయాల యథాశక్తి పక్షులకు ఆహారాన్ని పెడుతున్నాడు. ఎన్నో పక్షులు వాడుపెట్టే ఆహారాన్ని తిని పోతున్నాయి. ఇప్పుడు వాడు నిత్యం దైవప్రార్థన చేసుకుంటున్నాడు. భగవన్నామాన్ని జపిస్తున్నాడు. దానితో వాని పాపాలన్నీ నాశనమైపోయాయి. సంవత్సరానంతరం వాడు మరణించగానే వాణ్ణి తీసుకుపోవడానికి దేవవిమానం వచ్చింది. వాడు స్వర్గం చేరాడు.

మీరుకూడా ఏ ప్రాణిని హింసించకండి. జీవులన్నింటి మీద

దయచూపాలి. జీవులపై దయచూపునట్టి వారిపై పరమాత్మ ప్రసన్నుడై ఉంటాడు.

సోదరా! పరోపకారం కన్న పరమ ధర్మం లేదు.
పరపీడనం కన్న మహాపాపం లేదు.

----oOo----

## 6. సింహపు దెబ్బ

ఓ బ్రాహ్మణోత్తముడున్నాడు. అతడు నిరుపేద, సరళ స్వభావుడు. ఆ దేశంలో కరువు వచ్చింది. పాపం ఆ పేద బ్రాహ్మణునకు మోయను (స్వయంపాకము) ఎవరిస్తారు? ఎవరాయనచే పూజాపారాయణలు చేయించుకుని దక్షిణ యిస్తారు? పాపం ఆ బ్రాహ్మణునకు చాలకాలంగా అన్నం దొరకలేదు.

ఆ విప్రుడు యోచించసాగాడు "ఈ ఆకలితో వేదన పడడంకంటె మరణించడమే మంచిది."

చచ్చిపోవాలన్న సంకల్పంతో ఆయన అడవికి వెళ్ళాడు. మరణించడానకి ముందు ఆ బ్రాహ్మణుడు శుద్ధహృదయంతో భగవన్నామాన్ని స్మరిస్తూ ప్రార్థించాడు. అంతలో ఆయనకు ఓ సింహం కనిపించింది. దానిని చూస్తూనే ఆ బ్రాహ్మణుడు "మృగరాజా! నేను చచ్చిపోవాలని వచ్చాను. కనుక నువ్వు నన్ను భక్షించు", అన్నాడు.

సింహం దగ్గరగా వచ్చి అడిగింది– "నువ్వెందుకు భయపడడం లేదు?".

బ్రాహ్మణుడు సమాచారమంతా వివరించి "నువ్వు నన్నిప్పుడు వెంటనే తినివెయ్యి" అన్నాడు. యథార్థవిషయమేమంటే ఆ వనదేవతకు సరళ స్వభావంగల ఆ బ్రాహ్మణునిపై దయకలిగింది. ఆమెయే

సింహరూపంలో వచ్చింది. ఆ భూసురోత్తముడికి 500 బంగారు కాసులిచ్చింది. ఆనందంగా బ్రాహ్మణుడు స్వగృహానికి మరలివచ్చాడు. మరునాడు ఉప్పు, పప్పు, బియ్యం కొనాలని కాసులతో ఆ బ్రాహ్మణుడు అక్కడి కోమటి యింటికి వెళ్ళగా, ఈ కాసులు ఎక్కడివని అతడు ప్రశ్నించగా బ్రాహ్మణుడు నిజం చెప్పేశాడు. కావలసిన సామగ్రి తీసుకుని అతడు యింటికి వచ్చాడు.

కోమటి మహాలోభి. కాసులలోభంతో అతడు రాత్రివేళ అడవికి వెళ్ళాడు. అతడు కూడ నోటితో భగవన్నామాన్ని ఉచ్చరించి ప్రార్థించాడు. సింహం వచ్చింది. కోమటి "మృగరాజా! నువ్వు శీఘ్రంగా నన్ను భక్షించి కడుపునింపుకో" అన్నాడు.

"నేను నీవంటి లోభిని అవశ్యం భక్షిస్తాను కాని, ఏదో వంకతో నువ్వు భగవన్నామాన్ని స్మరించావు. కనుక నిన్ను చంపకుండ అల్పమైన శిక్ష విధిస్తాను" అంటూనే సింహం పంజాతో ఆ కోమటిని ఓ దెబ్బ కొట్టింది. దానితో వాని ఓ కన్నూ, చెవీ పచ్చడైపోయాయి. వాని లోభానికి తగిన బహుమానం లభించింది.

**దురాశ దుఃఖము చేటు.**

----oOo----

# 7. పొరపాటుకు ఫలం

రాత్రి వాన కురిసింది. తూర్పు తెల్లవారింది. రోజుకన్న విశేషంగా మిలమిల లాడుతూ సూర్యప్రభలు వ్యాపించసాగాయి.

మేకపిల్ల తల్లిపాలు కడుపునిండా త్రాగింది. గ్రాసాన్ని వాసనచూసి ఎగిరిగంతులు వేసింది. తడిసిన నేలమీద గంతులు వేయడమంటే దానికి మహానందం! కుప్పిగంతులు వేయసాగింది. ముందు తల్లిదగ్గర దగ్గరగా గంతులువేయసాగింది. చెవులకు గాలి తగలడంతో దూరంగా పోవాలనుకుంది.

తల్లి చెప్పింది కూడ దూరంగా వెళ్ళకు. అడవిలో చిక్కుకు పోతావు. నీకు దారి తెలియదు. మేకపిల్ల కొంచెందూరం ముందుకు వెళ్ళింది. అది అక్కడ నుండే చెప్పింది. నేను కొంచెంసేపు ఆడుకుని వస్తాను. నా గురించి నువ్వు చింతించకు. నేను దారిని మరచిపోను.

తల్లి నచ్చచెబుతూనే వుంది అప్పటికే మేకపిల్ల బహుదూరంగా వెళ్ళిపోయింది. తన తెలివిమీద దానికి అధికగర్వం, తల్లి అర్థగించడాన్ని అది లెక్కచెయ్యలేదు.

అది దూకడంలో లగ్నమైపోయింది. సంతోషంతో కుప్పిగంతులు వేస్తూ ముందుకు వెళ్ళిపోవడంలో దానికి దారి జాడ విషయమే స్మృతిలో లేదు. అది మనోహరమైన అరణ్యాన్ని చూసి ఇంకా కొంతదూరం ముందుకువెళ్ళి నేను అరణ్యాన్ని చూస్తాను అనుకుంటూ సాగిపోయింది. నిజంగా అది ఆ సాంద్రారణ్యంలో చిక్కుకుపోయింది. ఆ విషయం దానికి పరుగెత్తి పరుగెత్తి గెంతి గెంతి అలసిపోయిన తరువాత తెలిసింది. మరలి పోదామనుకునే సమయానికి దానికి దారి తెలియలేదు. ముళ్ళలో దట్టమైన పొదల మధ్య చిక్కుకుని అది వచ్చినదారిని మరచిపోయింది. అలా పరిభ్రమిస్తూనే వుండిపోయింది.

"అరే! నువ్విక్కడకు వచ్చి మంచిపని చేశావే! నాకు మూన్నాళ్ళనుండి తిండిదొరక లేదు. సమీపంలోని పొదలోనుండి ఓ పెద్ద తోడేలు పలుకుతూ బయటకు వచ్చింది".

మేకపిల్లకు సమాధానమిచ్చే అవకాశము దొరకలేదు. ఏడ్వడానికీ సమయంలేదు. దానికి తన యజమానియగు గొల్లవాని పలుకులు మాత్రం స్మరణకు వచ్చాయి.

తల్లి, తండ్రి, గురువు వీరుచెప్పిన మాటలు వింటే శుభాలు పొందుతావు. లేకుంటే వ్యతిరేక ఫలం తప్పక అనుభవిస్తావు.

----oOo----

## 8. కలసి వుంటే కలదు సుఖం

మన దేశంలో తక్కువ చెట్లుగల గ్రామాలు, నగరాలు ఎన్నో ఉన్నాయి. అట్టి స్థానాలలో ఆవులు, గేదెలు, ఎద్దులు అల్పంగా ఉంటె పిడకలు కూడ తక్కువగానే లభిస్తాయి.

ఓ చిన్న బజారు ఉంది. దానికి సమీపంలో చెట్లు అల్పంగా ఉన్నాయి. బజారులో రైతుల యిళ్ళు లేకపోవడం వల్ల పశువులు కూడ అల్పంగానే ఉన్నాయి. వంటచేసుకోవడానికి జనులు కట్టెలను, పిడకలను కొనుక్కోవలసిందే. పైగా నాటికి రెండు మూడు రోజుల నుండి వర్షం పడుతూనే వుంది. దానితో గ్రామాలనుండి ఎవరూ కట్టెలను, పిడకలను అమ్మడానికి రాలేదుకూడ. దానితో అక్కడ ఉన్న యిళ్ళల్లో వంటలు చేసుకోవడానికి కట్టెలు మిగలలేదు.

ఆ గ్రామానికి చెందిన అన్నదమ్ములిద్దరు ఎండుకట్టెల కోసం బయలుదేరారు. వాళ్ళ తండ్రి గ్రామంలో లేడు. వారి తల్లి ఎండుకట్టెలు లేకపోతే రొట్టెలు ఎలా తయారుచేసి బిడ్డలకు పెట్టగలుగుతుంది?

కొడుకు లిద్దరూ తమ తండ్రి నాటిన మామిడి చెట్టు దగ్గరకు వచ్చారు. అక్కడ తుపానుకు విరిగిపడిన ఓ పెద్ద ఎండుకొమ్మ నేలమీద వుండడం వారు చూశారు.

అన్న అన్నాడు, "కర్ర అయితే దొరికింది. కాని మనం దీనిని ఎలా తీసుకుపోగలం?"

తమ్ముడందుకుని "దీనిని విడిచి మనం వెళ్ళిపోతే ఎవరైనా దీనిని ఎత్తుకు పోతారు" అన్నాడు.

కానీ వారు చేయగలిగేది ఏముంది? అన్న వయస్సు పది సంవత్సరాలు, తమ్ముడి వయస్సు ఎనిమిదిన్నర సంవత్సరాలు. అంత పెద్ద కర్ర వారికి లేవదు. అంతలో చిన్నవాడు– ఆ కొమ్మతో బాటు పడిన ఓ పెద్ద పురుగును చిన్నిచిన్ని అనేక చీమలుకలిసి లాగుకుని పోతూండడం చూశాడు. వాడు గట్టిగా, " అన్నయ్యా! ఇదేమిటి?" అన్నాడు.

అన్న :– "ఈ చీమలు పురుగును లాక్కుపోతున్నాయి".

తమ్ముడు :– "ఇంత చిన్నచీమలు యింత పెద్ద పురుగును ఎలా లాక్కుపోతున్నాయి".

అన్న "చూడు ఎన్ని చీమలున్నాయో? అన్నీ కలిసి పెద్ద పురుగును సునాయాసంగా లాక్కుపోతున్నాయి. అనేకమైన చిన్న చీమలు కలిస్తే బలవంతమైన సర్పాన్ని కూడ యీడ్చుకు పోగలవు".

చీమలు నెమ్మదినెమ్మదిగా పెద్ద పురుగును యీడుస్తున్నాయి. పురుగు లావుగా వుంది. అది మాటి మాటికీ జారి పోతూంది. అప్పుడప్పుడు పది పదిహేను చీమలు దాని క్రిందపడి నలిగి పోతున్నాయి. కానీ, మిగిలిన చీమలు ఆ పురుగును కదిపి నలిగిపోతున్న చీమలను బయటపడేలా చేస్తున్నాయి. నల్లని, చిన్న చిన్న చీమలు 'అలసట'

అన్నపేరును ఎరుగవు. అన్నదమ్ములిద్దరూ అలా చూస్తుండగానే అవి ఆ పురుగును దూరంగా నెమ్మదినెమ్మదిగా యీడ్చుకు పోయాయి.

తమ్ముడు ఆనందించాడు, చప్పట్లు కొట్టాడు. కుప్పిగంతులు వేశాడు. వెళ్ళి పడి ఉన్న ఎండుకొమ్మమీద కూర్చున్నాడు "అన్నయ్యా! మనం చీమలకంటె తక్కువ వారమా? నువ్వు వెళ్ళి మీ స్నేహితులను పిలుచుకురా. నేనిక్కడ కూర్చుంటాను. మనమందరం కలిసి ఈ కొమ్మను ఎత్తుకు పోదాము". అన్నాడు.

పెద్దవాడు బజారుకు వెళ్ళి తన మిత్రులను పిలుచుకు వచ్చాడు. చాలా మంది పిల్లలు ప్రోగయ్యారు. వారందరూ ఆ పెద్ద కొమ్మను దొర్లిస్తూ ఈడ్చుకుపోసాగారు. మొత్తంమీద అందరూ కలిసి దానిని ఆ అన్నదమ్ముల యింటికి చేర్చారు.

ఆ పిల్లల తల్లి తన బిడ్డలతో వచ్చిన పిల్లలందరికీ మిఠాయిపెట్టి "బాబులూ! కలయికలో మహాబలం ఉంది. మీరందరూ కలసి పనిచేసి కఠినాతి కఠిన కార్యాలను సాధించగలుగుతారు. కలిసి మెలసి వుండడం వల్ల మీ మనస్సులు కూడ ఆనందంగా ఉంటాయి. మీ పనులు కూడ సునాయాసంగా జరుగుతాయి."

----oOo----

# 9. సాంగత్య ఫలం

ఓ బజారుకు చిలకల్ని అమ్మేవాడు వచ్చాడు. వాడి దగ్గర రెండు పంజరాలున్నాయి. ఒక్కొక్క పంజరంలో ఒక్కొక్క చిలక వుంది. ఆ బోయవాడు ఓ చిలుక విలువ ఐదువందల రూపాయలూ, మరోచిలుక విలువ ఐదురూపాయలూ చెబుతున్నాడు. ఎవరైనా ఐదు రూపాయల విలువగల చిలుకను కొనదలిస్తే ముందుగా కొనుక్కోవచ్చు. కానీ, ఎవరైనా ఐదువందల రూపాయల విలువగల చిలుకను కొంటే మాత్రం ఐదురూపాయల విలువగల చిలుకను కూడ కొనితీరాలి.

అక్కడి రాజుగారు ఆనాడు బజారుకు వచ్చాడు. ఆ బోయవాని కేకలు విని ఆయన ఏనుగుదిగి అడిగాడు– "ఈ రెండింటి విలువలో యింత తేడా ఎందుకు?".

బోయవాడు "వీటిని మీరు తీసుకువెడితే ఆ తేడాతమకే తెలుస్తుంది", అన్నాడు.

రాజుగారు ఆ రెంటినీ కొనుక్కువెళ్ళారు. రాత్రి పరుండబోయే ముందు ఆయన సేవకులను పిలచి ఐదువందల రూపాయల విలువగల చిలుకను తన పడకకి దగ్గరగా పంజరంలో వుంచుడన్నాడు. ప్రాతఃకాలంలో నాలుగు గంటల సమయమందు చిలుక పలుకసాగింది. "రామ్ రామ్, సీతారామ్" అంటూ చక్కగా సంకీర్తన చేసింది. మనోహరమైన శ్లోకాలను గానం చేసింది. రాజు మహానంద పరవశుడయ్యాడు.

మరునాడు ఆ మహారాజు రెండవ చిలుక పంజరాన్ని తన శయ్యా దగ్గర పెట్టించాడు. తూర్పు తెల్లవారక ముందే ఆ చిలుక దుర్భాషలు, కఠోరవచనాలు పలక సాగింది. మహారాజుకు మహాకోపం వచ్చింది. సేవకులను పిలిచి, "ఈ పక్షిని అంతం చెయ్యండి" అన్నాడు.

మొదటి చిలుక దగ్గరనే వుంది. అది వినయంగా పలికింది, "రాజా!

దీనిని చంపకండి. ఇది నా సోదరుడు. మే మిద్దరం ఒక్కసారే వలలో చిక్కుకున్నాము. నన్ను ఓ సాధువు తీసుకున్నాడు. అతని దగ్గర నేను భగవన్నామం నేర్చుకున్నాను. దీనిని ఓ మ్లేచ్ఛుడు పెంచాడు. వాని దగ్గర యిది దుర్భాషలు నేర్చుకుంది. ఇందులో దీని దోషమేదీ లేదు. ఇది దుస్సాంగత్య ఫలితం మాత్రమే". ఆ చిలుక పలుకులు విని మహారాజు ఆ చిలుకను చంపలేదు కానీ విడిచి పెట్టేశాడు.

----oOo----

## 10. తెలివిగల భల్లూకం

అతడు వేటకు బయలుదేరాడు. వెంట పొడవైన తుపాకీ, భుజంమీద మందుగుండ్ల పెట్టె ఉన్నాయి. ఎదురుగా ఉన్న పర్వతం మీదకు ఎక్కి అతడు బహుదూరం పురోగమించాడు. ఆ పర్వతాన్ని ఆనుకుని వేలఅడుగుల లోతుగల ఓ లోయ కూడ ఉంది. సన్నటిబాట ఆ పర్వతం మధ్యనుండి లోయవరకూ ఆవలితీరం వరకూ ఉంది. ఆవలివైపు అడవి రేగుపళ్ళు ఆ సమయంలో బాగా పండి ఉన్నాయి. ఎలుగుబంట్లు రేగుపళ్ళు తినడానికి పోతుంటాయన్న విషయం వేటగానికి బాగా తెలుసుకూడ.

ఓ చిన్న ఎలుగుబంటి యీ వైపు నుండి ఆ సన్నటి బాట గుండా, ఆవలిపైపు పోతూ వుండడం అతడు చూశాడు. తుపాకి పేలిస్తే ఎలుగుబంటి పిల్ల లోయలో పడిపోతుంది. లాభం లేదని అతడు మౌనంగా పురోగమిస్తున్నాడు. దూరదర్శిని ప్రయోగించగా ఆవలివైపు నుండి యీవలికి ఓ పెద్ద ఎలుగుబంటి వస్తుండడం గమనించాడు.

రెండు పోట్లాడుకుని చివరకు లోయలోపడి మరణిస్తాయనుకున్నాడు, తనలో తాను గుసగుసలాడుకున్నాడు. ఇద్దరు వ్యక్తులు ఒక్కసారిగా నడవడానికి వీలులేనంత సన్నటిబాట అది. ఒకరు వెనుకకు తిరిగితేనే కానీ రెండవవారు నడవడానికి దారి వుండదు. వేటగాడు తదేక ధ్యానంతో

చూస్తున్నాడు.

పోనీ ఒకదానిని పేల్చివేస్తాను. కాని ఆ ధ్వనికి రెండవది లోయలో పడిపోవడం తప్పదు. అనుకుంటూ మరోమార్గంలేక అతడలా చూస్తుండిపోయాడు.

అంతలోనే ఆ భల్లూకాలు రెండూ ఒకదానికి వేరొకటి ఎదురై నిలచాయి. అవి తమ భాషలో ఏమి మాట్లాడుకుంటున్నారియో తెలియదు. ఐదు నిమిషాలలోనే వాటి ధ్వనులు ఆగిపోయాయి. వేటగాడు చూస్తునే ఉన్నాడు. పెద్ద ఎలుగుబంటి మౌనంగా కూర్చుండిపోయింది, చిన్నది దానిమీదనుండి ఎక్కి ముందుకు సాగిపోయింది. అప్పుడు పెద్దభల్లూకము లేచి నిలబడింది.

ఓహో! జంతువులు యింత తెలివిగా వ్యవహరిస్తాయి కదా! మూర్ఖులైన మానవులు పరస్పరం కలహించుకుంటారే అనుకుంటూ వేటగాడు తుపాకీ పేల్చకుండ స్వగృహానికి మరలివచ్చి నాటినుండి వేటాడడం మానివేశాడు.

సత్సాంగత్యము మూర్ఖునైనా చక్కబరుస్తుంది.

-----oOo---

## 11. అతడు రామాయణం చదివి వుంటే ?

"హుయేన్ సాంగ్‌చే లాఊ" అతని పేరు. తండ్రి అతణ్ణి 'సాంగ్' అని పిలుస్తాడు. తండ్రి ఎలుగుబంట్లను వలవేసి పట్టుకుంటాడు. లేళ్ళను చంపుతాడు. తరువాత వాటి చర్మాలను అమ్ముతాడు. తండ్రి తాతల కాలం నుండీ వాళ్ళ వృత్తి అదే.

ఓ నాడు సాంగ్‌ను అతని తండ్రి ఓ చెట్టు నీడలో కుర్చోబెట్టి తాను తుపాకిని తీసుకుని అడవిలో ఓ దిశగా వెళ్ళి పోయాడు. సాంగ్‌కు తల్లికానీ, ఇంట్లో అన్నదమ్ములు, అక్కచెల్లెళ్ళు ఎవరూ లేరు. ఆ యింట్లో అతనికి ఒంటరిగా ఏమీ తోచదు. మాస్టర్‌గారి బెత్తానికి భయపడి ఆతడు పాఠశాలకు వెళ్ళడు. గ్రామంలోని పిల్లలందరూ చదువుకునేందుకు పాఠశాలకు వెళ్ళిపోతారు. ఇంక ఆ గ్రామంలో అతడు ఎవరితో మాత్రం ఆడుకుంటాడు.

తండ్రితో రోజూ అతడు అడవికి వెడతాడు, అప్పుడప్పుడు పక్షుల్ని ఎగురవేస్తాడు. మరొకప్పుడు కుందేళ్ళ వెనుకబడి పరుగులు తీస్తుంటాడు. అతనికక్కడ మధురమైన ఫలాలు తినడానికి లభిస్తుంటాయి. వేటగాని కొడుకు కావడంవల్ల వాడికి ఆ అరణ్యంలో ఏకాకిగా ఆడుకోవడానికి గానీ పరుగులు పెట్టడానికి కానీ ఎంతమాత్రం భయం వేయదు.

ఓ నాడు తండ్రి వెళ్ళిపోయిన తరువాత సాంగ్ అక్కడ తిరుగుతున్నాడు. అప్పుడు ఓ దిశనుండి "ఖోం ఖోం" అన్న ధ్వని రాసాగింది. అదేమిటో చూద్దామని అతడు అలా పరుగుతీశాడు. ఓ పెద్ద భల్లూకం ముళ్ళపొదలో చిక్కుకు పోయింది. దాని శరీరమంతా ముళ్ళు గుచ్చుకు పోయాయి. ఓ వైపున ముళ్ళను తీస్తుంటే మరోవైపున గుచ్చుకు పోతున్నాయి. ఆ భల్లూకం భయపడి పోతున్నది. సాంగ్‌కు దానిస్థితిని చూచి జాలికలిగింది. అతడు దానికి దగ్గరగా వెళ్ళి ముళ్ళనన్నింటినీ తొలగించి దానిని బంధవిముక్తను చేశాడు.

ఆ భల్లూకము గట్టిగా అరిచింది. ఆ పిల్లవాని ఎదురుగా నిలచి చాలసేపు గర్జిస్తూనే ఉంది. దానితో అతడు భయపడిపోయాడు. అది తనను భక్షిస్తుందేమోనని ఒణకిపోయాడు. పారిపోనూ లేడు అతడు ఏమనుకుంటూన్నాడో ఆ భల్లూకానికి ఏం తెలుస్తుంది? కొంచెం సేపట్లో ఆ భల్లూకము పారిపోయింది. పిల్లవానికి ప్రాణాలు లేచివచ్చాయి.

భల్లూకము ఎవరి మీదనైనా పగబడితే భయంకర శత్రువుగా మారిపోతుంది. అది చెట్టుమీదకైనా ఎక్కివేస్తుంది. కాని, ఎవరిమీదనైనా స్నేహభావం కలిగివుంటే మాత్రం సన్మిత్రునిలా సంచరిస్తుంది. తనకు సహకరించిన వారిని అది ఎన్నడూ మరచిపోదు. అన్యప్రాణులపై దయచూపునట్టి వారికి ఫలితం తప్పక లభిస్తుంది. ప్రపంచంలోని ఎన్నోజంతువులు తమకు సహకరించిన మానవులకు ప్రత్యుపకారం చేసిన ఘట్టాలెన్నో ఉన్నాయి. ఆ భల్లూకము భాషను సాంగ్ అర్థంచేసుకోలేకపోయాడు. కానీ అది అన్నదేమిటో తెలుసా? "నేను నీకు మిత్రుడను నీకై యిప్పుడే మధురాతి మధుర ఫలాలను తెస్తాను" అంది.

సాంగ్ అక్కడనుండి బహుదూరం పారిపోవాలనుకున్నాడు. అతడు పరుగెత్తసాగాడు. అతడు కొంచెం దూరం వెళ్ళాడో లేదో ఆ భల్లూకం అక్కడకు వచ్చింది. ఈసారి అదిఎన్నో మధుర ఫలాలను తెచ్చింది. వాటినన్నింటినీ సాంగ్ చేతికిచ్చింది. అతడు వాటిని రూచిచూడగా అవి మహా మధురంగా ఉన్నాయి.

సాంగ్ భల్లూకం మధ్య స్నేహం బలమైపోయింది. ఆ మైత్రినిచూసి సాంగ్ తండ్రి మహానందం చెందాడు. భల్లూకం ప్రతిరోజూ సాంగ్‌కు తియ్యటి పళ్ళను తెచ్చియిస్తున్నది. సాంగ్ అందులో కొన్నిపళ్ళను తండ్రికికూడ యిచ్చేవాడు. ఓ నాడు అడవిలోకి వస్తూనే భల్లూక స్నేహితుడు కళ్ళబాధతో దుఃఖిస్తూండడం సాంగ్ చూశాడు. ఓ చెట్టు మొదలును ఆనుకుని అది కూర్చున్నది. "ఉఁ ఉఁ" అని మూలుగుతున్నది. సాంగ్‌కు నవ్వు వచ్చింది. చప్పట్లు కొడుతూ వాడు నవ్వసాగాడు. దానితో భల్లూకానికి మహాకోపం వచ్చింది. అంతే అది సాంగ్ ముక్కు పీకివేసింది.

వాడు రామాయణం చదివివుంటే వాడికి ఆ దశ ఏర్పడేదా చెప్పండి. వాడు రామాయణం చదివి ఉంటే వాడికి అవశ్యం తెలిసేది.

దుఃఖితుడైన మిత్రుని జూచి దుఃఖించని వాని దర్శనము పాతకము.
(రామచరితమానసం, కిష్కింధ)

----oOo----

## 12. ప్రత్యుపకారం

అది ఓ సింహపు గుహ. అంతా గంభీరముగా అంధకారమయముగా ఉంది. అందులోనే ఓ బొరియను ఏర్పరచుకుని ఓ చిట్టెలుక కూడ ఉంటున్నది. సింహం వేటాడి తెచ్చిన జంతువుయొక్క శేషించిన ఎముకల నంటియున్న మాంసం ఆ చిట్టెలుకకు ఎక్కువే. సింహం అడవిలోకి పోయిన తరువాత ఆ చిట్టెలుక తన బిలంనుండి బయటకు వచ్చి ఎముకలనంటియున్న మాంసాన్ని నాకి కొరికి కడుపు నింపుకుంటూ వుంటుంది. అలా కొంత కాలానికి అది బాగా బలిసి లావుగా అయిందికూడ.

ఓ నాడు రెండు ఝాములవేళ సింహం నిద్రపోతున్నది. అప్పుడే ఎలుకకు బాగా ఆకలివేయగా అది బిలంనుండి బయటకు వచ్చి తన పొట్ట నింపుకుంది. సింహానికి దగ్గర దగ్గరగా వుండడం వల్ల క్రమేణ దాని భయం దూరం కాసాగింది. కడుపు నిండిపోవడం వల్ల అది సింహం మీద ఎక్కింది. కోమలమై, దట్టమైన సింహం యొక్క శరీరం దానికి బాగా నచ్చింది. అది దాని కాళ్ళమీద, వీపుమీద, మెడమీద, ముఖంమీద యిటూ అటూ పరుగెత్తసాగింది.

ఆ హడావిడిలో సింహానికి మెలుకువ వచ్చింది. అది పంజాఎత్తి ఎలుకను పట్టుకుంది. గద్దిస్తూ "అరే! నువ్వు నా శరీరం మీద ఏమిటీ కోలాహలం చేస్తున్నావు?" అంది.

ఆ చిట్టెలుక ప్రాణాలు పైకిపోసాగాయి. ఎట్టకేలకు ధైర్యాన్ని చిక్కబట్టుకుని– "ప్రభూ! నిజంగా నా వల్ల మహాపరాధమే జరిగింది. సర్వసమర్థులైన మీరు నాకు ప్రాణదానం చేస్తే శక్తివంచన లేకుండ మీ సేవచేసుకుంటూ పడివుంటాను", అంది.

సింహం నవ్వుతూ "ఆ చిట్టెలుకను విడిచి పెడుతూ పో, నాకు నువ్వు చేసే సేవ ఏముందిలే. మృగరాజునైన నాకు చిట్టెలుక సేవావసరం లేదు. కాని నిన్ను మాత్రం క్షమిస్తున్నాను", అంది.

విధివిధానాన్ని తిలకించండి. ఓ జంతుప్రదర్శనశాల వారికి సజీవంగా వుండే సింహం కావలసి వచ్చినది. అరణ్యంలో వల పన్నేశారు. సింహం అందులో చిక్కుకుని భయంకరంగా గర్జించసాగింది.

సింహం అత్యంత శక్తిసంపన్నమైన జంతువు. అది మాటిమాటికి పంజాతో, దంతాలతో ఆ వలను ముక్కలు చేయాలని ప్రయత్నించ సాగింది. ఎగిరి పారిపోవాలనుకుంది. కానీ ఆ వల సామాన్యమైనది కాదుకదా, సింహాన్ని చిక్కించు కోవడానికి వాడే వల ఎక్కడైనా బలహీనంగా వుంటుందా". సింహం ఎంతగా గింజుకున్నా, పంజాతో వలమీద దెబ్బలు కొట్టినా వల ఎంతమాత్రం దెబ్బతినలేధు. సింహం యొక్క గోళ్ళనుండి, నోటినుండి రక్తం స్రవించసాగింది. అయినా అది తన ప్రయత్నం మానలేదు. రక్తసిక్తమైన వల మరీ మోటుగా తయారయింది. అందువల్ల సింహం అలసి సొలసి కదలజాలనిదై పోయింది.

అడవి రాజైన సింహం వలలో చిక్కుకుని గర్జిస్తున్నది. అది గతంలో ఎన్నడూ ఎవరికీ భయపడలేదు. ఎవరూ ఎన్నడూ దానిని బంధించలేదు కూడ. వలలో చిక్కుకునిపడి ఉండడం దానికి మహాబాధగా ఉంది. కానీ, యిప్పుడు పాపం అది చేయగలిగేది మాత్రం ఏముంది? అది గర్జిస్తునే ఉంది. కొద్దిగా భయపడసాగింది కూడ. తనను ఎవరో బంధించి తీసుకుపోతారని గ్రహించింది.

ఆ సింహనాదాలను చిట్టెలుక పసికట్టింది. అది పరుగెత్తుకు వచ్చి ప్రభూ! మీరు మౌనంగా ఉండండి గర్జించడం వల్ల దూరంగా పోయిన వేటగాళ్ళు పరుగెత్తుకువస్తే నాకు భయం వేస్తుంది. నేను ఏ పనిచేయలేను. ఇప్పుడు నేను యీ వలను కొరికి వేస్తాను అంది.

సింహం మౌనం వహించింది. వల చాలా గట్టిగా వుంది. చిట్టెలుక దంతాలనుండి రక్తం కారసాగింది. అయినా అది శ్రమపడి వలను కొరికివేసింది. సింహం ఏదో మాట్లాడబోగా చిట్టెలుక- "మీరు శీఘ్రంగా పారిపొండి. నా జీవనదాత అయిన మృగరాజుకు యీపాటి సేవచేసిన నా అదృష్టం, సామాన్యమైనదా?" అంది. అంత సింహం ఈ మాటలే పలికింది.

"ఉపకారికి ప్రత్యుపకారం జరిగి తీరుతుంది"

----oOo----

## 13. ఉపకారం

ఆఫ్రికా చాలా పెద్దదేశం. అక్కడ మహారణ్యాలు, వాటిలో సింహ, వ్యాఘ్రు, భల్లూకాది కౄరమృగాలు విశేషంగా ఉన్నాయి. చర్మాలకోసం చాలామంది అక్కడ సింహాలను వేటాడుతూ ఉంటారు.

వేసవిలో ఏనుగులు దాహం తీర్చుకునే నిమిత్తం వెళ్ళే దారులలోనే వేటగాళ్ళు పెద్ద పెద్ద గోతులు తీస్తుంటారు. ఆ గోతులను నలువైపులా ఆకులలములతో కప్పి ఉంచుతారు. ఆపై ఆ గోతిని చిన్న చిన్న కఱ్ఱముక్కలతో, కొమ్మలతో, రెమ్మలతో మూసి వుంచుతారు. పాపం ఏనుగులు ముందుకు చూస్తూ దూసుకుపోతూ ఆపైకప్పు మీద కాలు వేయడంతో గోతిలోకి పడిపోతాయి. ఏనుగులను పట్టుకునేవారు తమ పెంపుడు ఏనుగుల సహకారంతో ఆ గోతికి మరోవైపు దారిచేసి ఆ ఏనుగును పట్టి పైకి తీసుకు వస్తుంటారు.

అలా పట్టిన ఏనుగును చాలకాలం తిండీ తిప్పలు లేకుండ ఉంచి బలహీనంగా చేసివేస్తారు. ఆ పై గోతినుండి పైకి తీసేవేళలో అది ఎట్టి కోలాహలం చేయకుండా సునాయాసంగా బయటకు వస్తుంది. ఆకలితో గిలగిలలాడుతున్న ఏనుగుకు ఆహారం యివ్వడానికి ఓ వ్యక్తి వెడతాడు. ఆహారం యిచ్చే వంకతో వెళ్ళే ఆ వ్యక్తి పదేపదే రావడంవల్ల ఏనుగు అతణ్ణి గుర్తుపడుతుంది. క్రమక్రమంగా అతడే దానికి అన్ని విద్యలు నేర్పుతూ ఉంటాడు. క్రమశిక్షణ పూర్తి అయిన తరువాత వారు దానిని విక్రయిస్తారు.

ఎన్నో పర్యాయాలు ఏనుగులను పట్టుకోవడానికి త్రవ్వే గోతులలో అడవి జంతువులు రాత్రివేళల్లో పడిపోతుంటాయి. ఏనుగులను పట్టేవారు ఓసారి వాటికోసం ఆఫ్రికా అరణ్యంలో ఓ పెద్దగోతిని త్రవ్వి అన్నియేర్పాట్లు చేసి ఉంచారు. రాత్రివేళ ఓ సింహం అందులో పడిపోయింది. ఓ చిన్న జంతువును వేటాడ పరుగెడుతూ సింహం పొరపాటున ఆ గోతిలో పడిపోయింది.

వేటగాడొకడు ఆ దారినే పోతున్నాడు. గోతిలో చిక్కుకున్న మృగరాజును వాడు చూశాడు. వీరులైన వారు కష్టాలలో చిక్కుకున్న వారిని హింసించరు సరికదా, పాపం! సింహం మాటిమాటికీ పైకి ఎగురుతూ ఉంది. కాని, ఆ గోతికి నలువైపుల పాతబడిన సూదిమొనలవంటి మొనలుగల కర్రలు గుచ్చుకుని వేదన పడుతున్నది. దానితో అది మరల గోతిలో పడిపోతున్నది. వేటగాడు ఓ త్రాటికి రెండు కర్రలు కట్టి చెట్టు ఎక్కేశాడు. చెట్టుమీద నుండి త్రాటి సహకారంతో కర్రలను లాగివేశాడు. క్రిందనుండి చుట్టూ పాతిన కర్రలను వేటగాడు పీకక పోవడానికి కారణం? సింహం పైకివచ్చిన తరువాత తనను అంతం చేస్తుందేమోనని అతనికి భయంవేసింది. రెండు కర్రలను పీకివేసేసరికి సింహానికి దారి యేర్పడింది. అది ఒక్క దూకు దూకి పైకి వచ్చేసింది.

కాలాంతరంలో ఓ నాడు ఆ వేటగాడు నదీతీరంలో తుపాకి పక్కన పెట్టి దాహం తీర్చుకుని విశ్రాంతిగా కూర్చున్నాడు. వాడు బాగా అలసి

ఉన్నాడు. అంతలోనే అక్కడకు ఓ చిరుతపులి వచ్చింది. వాణ్ణి అంతంచేయ అది వానిమీద ఎక్కింది, దానితో మెలకువవచ్చి వాడు గజగజ వణికిపోతున్నాడు. పాపం వాడు భయకంపితుడై అరవలేక పోయాడు.

అంతలోనే ఓ మహాసింహం భయంకరంగా గర్జించింది. ఆ గర్జన విని చిరుతపులి తోకముడుచుకుని అక్కడనుండి పారిపోయింది. అయినా సింహం చిరుతపులి మీద విరుచుకుపడి దానిని చీల్చి చెండాడి అంతం చేసివేసింది. చిరుతపులిని అంతంచేసిన సింహం యిప్పుడు నన్నుకూడా సంహరిస్తుందని వేటగాడు భావించాడు. కాని సింహం అతనికెదురుగా వచ్చి కూర్చుని ప్రసన్నంగా తోకను ఆడించసాగింది. గోతిలోనుండి తాను రక్షించిన సింహం అదే అని వేటగాడు గ్రహించాడు. సింహంవంటి భయంకర మృగంకూడ తనకు ఉపకారం చేసిన వానిని మరువలేదు. నువ్వు మానవజన్మ నెత్తావు. ఎవరైనా నీకు అల్పంగా సహకరించినా అట్టివారిని మరువకూడదు.

**ఉపకారం చేసిన వారికి**

**ప్రత్యుపకారం చేయ సర్వదా సంసిద్ధుడవై ఉండాలి.**

-----oOo-----

## 14. పాషండత్వ పరిణామం

ఓ నక్క ఉండేది. ఓ నాడు అడవిలో దానికి తినడానికి ఏమీ దొరకలేదు. ఆకలితో అది చాలా బాధపడ సాగింది. చివరకు అది సాహసించి నగరంలో ఏమైనా దొరుకుతుందేమోనని అన్వేషించ వచ్చింది. చీకటి రాత్రి జనులందరూ నిద్రపోతున్నారు పైగా అది వర్షకాలం కూడాను. ఇండ్ల తలుపులు బంధించి ఉన్నాయి. ఆ నక్క ప్రతి సందూ తిరుగసాగింది.

అది ఓ చాకలి ఇల్లు, అక్కడ గాడిదలు బంధించబడి ఉన్నాయి. ఓ బానలో బట్టలు నానుతున్నాయి. ఇంకో బానలో మరేవో ఉన్నాయి. ఆ బానలో నుండి ఏదో వాసన రావడంతో అందులో యేదైనా తినేపదార్థం దొరుకుతుందేమోనని దానిని తినవచ్చునని భావించి ఆ నక్క ఎగిరి ఆ బానలోకి దూకింది. వర్షాకాలం, రాత్రివేళ పైగా బానలోని నీళ్ళలోకి దూకేసరికి నక్కపరిస్థితి చాల దయనీయంగా తయారయింది. ఎలాగో ఆ బాననుండి బయటపడి చలికి వణికిపోతూ అడవిదారి పట్టి పారిపోయింది.

తూర్పు తెలవారిన తరువాత సెలయేటి నీటిలో దాహం తీర్చుకుంటూ తన ప్రతిబింబాన్ని అందులో చూసి ఆశ్చర్యపోయింది. అది గతరాత్రి బానలో నీలిమందు కలిపిన నీళ్ళలో దూకింది. దాని రూపే మారిపోయింది. దానికి మహానందం కలిగింది. అడవిలో జంతువుల సభ ఏర్పాటుచేసింది. అది గంభీరంగా సభలో ప్రసంగించసాగింది. "నేను నీలాకారుణ్ణి, బ్రహ్మదేవుడు నన్ను అడవికి రాజును చేసి పంపాడు. నా ఆదేశాలను పాలించని వారికి తీవ్రమైన శిక్ష విధించబడుతుంది".

అటువంటి అద్భుతవర్ణంకల జంతువును అరణ్యంలో ఆ మృగాలేవీ యెన్నడూ చూడలేదు. అందుకవన్నీ నక్కపలుకులు విని అంగీకరించాయి. నక్క అడవికి రాజు అయింది. అందరినీ శాసించసాగింది. ఆ నక్క సింహాన్ని తన మంత్రిగా చేసుకుంది. చిరుతపులిని సేనాపతిగా ఉంచింది. ఇతరేతర మృగాలను సైన్యంగా ఉంచుకుంది.

అది ఠీవిగా కూర్చుని అందరికీ ఆదేశాలిస్తూ ఉంది. సింహం వేటాడి దానికోసం ఆహారం తెచ్చి యిస్తున్నది. ఎలుగుబంటి దానికోసం తియ్యటిపళ్ళు రేగుపళ్ళు తెచ్చి పెడుతుంది. ఆ నక్క మాత్రం ఏ పనీ చేయకుండ హాయిగా బ్రతుకుతున్నది. జంతువులన్నీ దానిని "నీలవర్ణ మహారాజు" అని పిలవసాగారు. అన్నిటికన్నీ దానికి ప్రణమిల్లుతున్నాయి.

కపటి అయిన ఆ నక్క తన జాతివారిని మాత్రం అసహ్యించుకుంటున్నది. వాటిని తన దగ్గరకు కూడ రానీయడం లేదు. తన వారెవరైనా దగ్గరకు వస్తే వారు తనను పసికడతారని దాని భయం. తనను కలుసుకోవడానికి అది ఏ నక్కకు అవకాశం యివ్వడం లేదు. సైన్యాధిపతి అయిన చిరుతపులికి అది ఆదేశమివ్వనే యిచ్చింది. నక్కలన్నింటినీ అడవినుండి పారద్రోలమంది. నక్కల సముదాయంలో ఆ క్రొత్త రాజు ప్రవర్తనకు కోలాహలం చెలరేగింది. అంతవరకూ ఏరాజూ వాటిని అడవినుండి పారద్రోలలేదు. పైగా ఏ సింహమూ నక్కలను వేటాడేవి కావు. ఈ క్రొత్త రాజు అకస్మాత్తుగా నక్కలన్నింటినీ అడవి బయటకు పారద్రోలే శాసనం చేశాడు. వక్కలు పదేపదే పరస్పరం కలుసుకోసాగాయి. అవి సమాలోచనలు కూడ సాగించాయి. ఎలాగైనా ఈ విషయంలో రాజుకు నచ్చచెప్పాలని ప్రయత్నిస్తున్నాయి. స్వగృహాలను విడనాడి పాపం అవన్నీ ఎక్కడకు వెడతాయి? కానీ వాటికి ఉపాయమేది తోచలేదు.

ఓ నాడు ఒంటి కన్నుగల ఓ నక్క స్వజాతి వాళ్ళతో పలికింది– "ఈ క్రొత్తరాజు విచిత్రంగా ఉన్నాడే. దీని దంతాలు, పంజా కూడ దృఢంగా లేవే. మృగరాజైన సింహం యితరులు వేటాడిన దానిని ముట్టనైనా ముట్టదు. ఇది చూస్తే యితరుల ద్వారా తన ఆహారాన్ని ఏర్పాటు చేసుకుంటుంది".

మరో నక్క అందుకుంది– "ఈ వ్యవహారంలో ఏదో మోసం ఉంది. దీని ఆకార, వ్యవహారాలు చూస్తుంటే మనలను పోలి ఉన్నట్లుంది. కేవలం వర్ణంలో మాత్రమే భేదముంది".

ఏకాక్షి నక్క పలికింది– "సరే! మనమందరం దాని దగ్గరగా వెళ్ళి

హు ఆc, హు ఆc అందాము. దానితో రంగు బయట పడుతుంది."

ఆ సలహా అందరికీ నచ్చింది. దొంగ నక్క జంతుసభలో కూర్చుని ఉంది. వెనుకవైపు నుండి నక్కకూతలు వినిపించసాగాయి. ఆ దొంగనక్క స్వస్థితిని మరచి పోయింది. చెవులు నిక్కబెట్టింది. ముఖాన్ని ఆకాశం వైపుకు ఎత్తింది. తోకను విదిలించి కూయడం ఆరంభించింది.

"అరే! ఇది నక్కరా! జంతువులన్నీ క్రోధంతో అరిచాయి. అవన్నీ దాని మీద విరుచుకు పడ్డాయి. నక్క పారిపోవాలనుకునే లోగానే అడవి జంతువులు దాని శరీరాన్ని చీల్చి ఖండఖండాలు చేసివేశాయి".

కపటానికి ఫలితం తప్పదు.

----oOo----

## 15. బాబాజీ – దొంగతనం

ఓ బాబాజీ స్నానార్థం గంగానదికి వెళ్ళాడు. ఆయన కపట భావంతో అర్థరాత్రియే బయలుదేరాడు. రాత్రివేళ ఆయనకు ఓ దొంగల ముఠా ఎదురయింది. వారు బాబాజీతో– "నువ్వు మాతో దొంగతనానికి రాకపోతే నిన్ను హతమారుస్తాం", అన్నారు.

పాపం బాబాజీ ఏం చేస్తాడు. వారితో వెళ్ళాడు. దొంగలు ఓ మంచి యింటికి కన్నం త్రవ్వారు. ఓ దొంగ బయట నిలబడ్డాడు. మిగిలిన వాళ్ళు లోపలకు దూరారు. బాబాజీని కూడ వారు లోపలకు తీసుకు వెళ్ళారు. దొంగలు అక్కడ పెట్టెలను, ఇనప్పెట్టెను, ద్రవ్య, ఆభరణాలకై అన్వేషించసాగారు. అక్కడ ఓ పవిత్ర స్థానంలో సింహాసనం మీద భగవంతుడు విరాజిల్లుతున్నాడు. ఏదో చెయ్యాలని మనము వచ్చాము కదా! అనుకుంటూ బాబాజీ దైవపూజ చేయకూర్చున్నాడు. గంధం తీశాడు. ధూప, దీపాలను ఏర్పాటుచేశాడు. నైవేద్యానికి యిటూ అటూ చూశాడు. అక్కడ ప్రసాదం ఏదీ లేదు. భగవంతుడు మేల్కొన్న తరువాత సేవకులు వస్తారు. వాళ్ళను అడిగి నైవేద్యం తీసుకోవచ్చును అనుకున్నాడు. పట్టుదుప్పటి కప్పుకుని భగవానుడు శయనించాడు. పూజార్థం అతణ్ణి

మేలుకొలపాలి కదా! బాబాజీ శంఖం తీసి పూరించి గంభీరనాదం చేశాడు. భగవంతుడు లేచాడోలేదో తెలియదు కానీ యింట్లో వారందరి కందరూ లేచారు. దొంగలందరూ ముసుగులు వేసుకుని శీఘ్రంగా పారిపోయారు. ఇంటివారు . పరుగెత్తుకు వచ్చి బాబాజీని పట్టుకున్నారు. బాబాజీ -"అరవకండి. భగవంతుడికి నైవేద్యం నిమిత్తం ఏమైనా తీసుకురండి. అంతవరకూ నేను పూజ చేస్తుంటాను. పూజానంతరం మీ అందరికీ ప్రసాదం యిస్తాను. కన్నం త్రవ్వి నాతో ఈ గృహంలో ప్రవేశించిన దొంగలందరికీ కూడ ప్రసాదం పెడతాను. వెళ్ళి త్వరగా రండి", అన్నాడు. ఆ యింట్లో వారందరికీ మహాశ్చర్యం వేసింది. బాబాజీ ద్వారా అన్నీ తెలుసుకున్నారు. అప్పుడు ఓ స్త్రీ నవ్వుతూ నైవేద్యం కోసం మధురఫలాలు తెచ్చిపెట్టింది.

----oOo----

## 16. నాకు మనిషి కావాలి.

అస్సాంలో ఓ దేవాలయం ఉంది. అది చాల పెద్దది. వేలాది సంఖ్యలో అక్కడకు యాత్రికులు దర్శనార్థం వస్తుంటారు. ఆ మందిర ప్రధాన పూజారి అకస్మాత్తుగా మరణించాడు. మందిర మహంతుకు మరో పూజారి అవసరం వచ్చింది. "రేపు ఉదయం మొదటి ఝాములో యిక్కడకు పూజకు సంబంధించిన విషయంలో సంసిద్ధంగా రాగల వానిని పూజారిగా ఉంచుతాము", అని మహంతు చాటింపు వేయించాడు.

ఆలయం చాలా పెద్దది, పూజారికి ఆదాయం విశేషంగా వస్తుంది. అనేక మంది బ్రాహ్మణులు అక్కడకు ఉదయమే చేరాలని బయలుదేరారు. ఆలయం పర్వతం మీద ఉంది. ఏకమాత్రమైన మార్గమే ఉంది. దారి అంతా రాళ్ళూ, రప్పలు, ముళ్ళు ఉన్నాయి. ఆలయం వైపు బ్రాహ్మణ బృందం పురోగమిస్తున్నది. రాళ్ళను ముళ్లను తొలగించుకుంటూ ఎలాగో వారు వెడుతున్నారు. బ్రాహ్మణులందరూ చేరారు. మహంతు అందరినీ సాదరంగా ఆసీనులను చేశాడు. అందరికీ దైవప్రసాదం లభిస్తుంది. సర్వులనూ వేరు

వేరుగా మంత్రాలను గురించి నిర్వహణాదులను గురించి ప్రశ్నలు వేశారు. చివరకు పరీక్ష పూర్తి అయింది. రెండు ఝాములవేళ కాగానే అందరూ లేచి నిలబడ్డారు. అదే సమయంలో ఓ బ్రాహ్మణ యువకుడు అక్కడకు వచ్చాడు. వానిబట్టలు చిరిగి ఉన్నాయి. అతని ఒళ్ళంతా చెమట పట్టేసింది. చాలా పేదవాడిలా కనిపిస్తున్నాడు. మహంతు ప్రశ్నించాడు "నువ్వు చాలా ఆలస్యంగా వచ్చావే!". "ఆ విషయం నాకు తెలుసు. నేను భగవద్దర్శనం చేసుకుని మరలిపోతాను", అని ఆ యువకుడు బదులు పలికాడు. అతని దశకు మహంతు దయార్ద్రుడవుతున్నాడు. నువ్వు త్వరగా ఎందుకు రాలేదు? యువకుడు– "ఇంటి దగ్గర నుండి త్వరగానే బయలు దేరాను స్వామీ! ఆలయానికి వచ్చే దారిలో ఎన్నో రాళ్ళు, ముళ్ళు అడ్డంగా పడి ఉన్నాయి. పాపం యాత్రికులకు వాటివల్ల చాలా కష్టం కలుగుతుందని తలచి వాటిని తొలగిస్తూ రావడంలో ఆలస్యమయింది".

మహంతు :– "బాగుంది నీకు పూజ చేయడం తెలుసా?".

యువకుడు :– "భగవంతునికి స్నానం చేయించిన తరువాత గంధ పుష్పాదులు అర్పించడం, ధూప దీపాదులు ప్రజ్వరిల్లచేయడం ఎదురుగా నైవేద్యాన్ని ఉంచి తెరవేసి, శంఖనాదం చేయడం" తెలుసును.

"మరి మంత్రాలు" మహంతు ప్రశ్నించాడు. యువకుడు ఉదాసీనుడై పలికాడు– భగవంతునికి స్నానం చేయించడానికీ, నైవేద్యమారగించుమని చెప్పడానికి మంత్రాలుంటాయని నాకు తెలియదు", ఆ సమాధానానికి పండితులందరూ నవ్వుతూ "ఈ మూర్ఖుడు కూడ పూజారి అవాలని వచ్చాడే! అన్నారు.

మహంతు క్షణకాలం ఆగి, "నిన్నే మా ఆలయ పూజారిగా ఎన్నుకున్నాను. నేటి నుంచి మంత్రాలు నేర్చుకో, నేను నేర్పుతాను. నాకు మానవత్వం ఉన్నవాడు కావాలని భగవానుడు నాకు స్వప్నంలో కనిపించి చెప్పాడు", అన్నాడు.

"అయితే మేము మనుష్యులం కాదా?", అని పండితులు ప్రశ్నించారు. వారందరూ మహంతును క్రోధంగా చూశారు. "పాండిత్యం ఉన్న విద్వాంసులను విడనాడి మంత్రం అంటే ఏమిటో తెలియని వానిని పూజారిగా నియమిస్తారా? ఇది పండిత సమాజానికే మహావమానం". అన్నారు.

మహంతు పండితులవైపు తిరిగి– "తమ స్వార్థవిషయాలను గురించి పశువులకు కూడా తెలుసు. కొన్ని జంతువులు అతి తెలివిగా ఉంటాయి కూడ. పరులకు సుఖాన్ని చేకూర్చగలవాడే మానవకోటికి చెందినవాడు కాగలడు. పరుల సుఖం కోసం స్వార్థాన్ని, స్వసుఖాన్నీ కూడ త్యాగం చేయగలవాడే ఉచ్ఛకోటికి చెందిన మనుష్యుడవుతాడు. అన్నాడు గంభీరంగా. పండితులు తమ శిరస్సులను క్రిందకు దించుకున్నారు.

"సోదరా! నీవు మనుష్యుడవు అవునో కాదో ఆలోచించుకో."

----oOo----

## 17. తాబేలు, గురువు

ఓ వృద్ధుడుండే వాడు. గంగా తీరంలో అతని బస; ఓ చిన్న గుడిసె వేసుకున్నాడు. గుడిసెలో ఓకొయ్య పలక, నీటితో నిండిన ఓ కుండ ఉన్నాయి. అతడు ఓ తాబేలును పెంచుతున్నాడు. దగ్గరలో ఉన్న బస్తీలోకి రొట్టెల కోసం యాచనార్థం వెళ్ళే వేళలో కొంచెం శనగలు కూడ యాచించి తెస్తుండేవాడు. నానబెట్టిన శనగలను తాబేలుకు పెట్టేవాడు.

ఓ నాడు ఆ వృద్ధుని దగ్గరగా ఒకడు వచ్చి "మీరు అధమ జీవిని పెంచుతున్నారెందుకు? దీనిని గంగలో పారవేయండి", అన్నాడు.

అందుకు ఆ ముసలిబాబా చాలా విసుక్కుని– "నువ్వు నా గురుబాబాను అవమానిస్తావా! చూస్తున్నావు కదా; అల్పమైన శబ్దాన్ని ఆలకించి ఎవరి స్పర్శనైనా పొందియిది తన సర్వాంగాలను తనలోపలకు

ఎలా సంకుచితం చేసుకుని స్థిరంగా ఉండి పోతున్నదో? దీనిని నువ్వు ఎంతగా కదిపినా కుదిపిన ఊపివేసినా యిది తన ఒక్క కాలును కూడ కదపదే".

"అంతమాత్రంచే ఏమయిందయ్యా" ఆ వచ్చిన వ్యక్తి ప్రశ్నించాడు.

ఎందుకు కాలేదు? మానవుడు కూడ దీనిలాగే సావధానుడై ఉండాలి. లోభ మోహాలలో కానీ, జనసముదాయంలో జరిగే కోలాహలాదులలో కానీ కనులు మూసుకుని "రామ రామ" అనాలి.

యథార్థ విషయం ఏమంటే ఆ ముసలాయన ఎవరినైనా చూస్తే తన గుడిసెలోకి వెళ్ళిపోయి బిగ్గరగా "రామ్ రామ్" అంటాడు. పిలచినా పలుకకుండ ఉండిపోతాడు. వాడు ఎందుకు మాట్లాడడో ఎవరికీ తెలియదు.

"తాతగారూ! మీరేమనండి. ఎన్నిచెప్పండి యీ తాబేలు మాత్రం అసహ్యంగానే ఉంది", అన్నాడా వ్యక్తి.

"అయితే పోయిందేమిటి? మనకు పరమలాభం లభించేటప్పుడు అధములతో కూడ స్నేహం చేయాలి", అంటూ ఆ వృద్ధుడు తాబేలును అరచేతిలోకి తీసుకుని నిమురసాగాడు.

-----oOo-----

## 18. కొంగ ఎగిరి పోయింది

జపాన్ దేశంలో ఓ సామాన్యమైన పశువుల కాపరి ఉన్నాడు. వాడి పేరు మూసాయీ. ఓ నాడు వాడు ఆవులను మేపుతున్నాడు. అదే సమయంలో ఓ కొంగ ఎగురుతూ వచ్చి వాడి కాళ్ళదగ్గర పడిపోయింది. ఆ కాపరి కొంగను లేవనెత్తాడు. డేగ ఆ కొంగను గాయపరచి ఉండవచ్చును. దాని తెలతెల్లటి రెక్కల మీద ఎర్రటి రక్తపు చుక్కలున్నాయి. పాపం ఆ పక్షి మాటి మాటికీ నోటిని బాధతో తెరుస్తున్నది.

మూసాయీ దాని వీపుమీద దయతో నిమురసాగాడు. సెలయేటి దగ్గరకు తీసుకువెళ్ళి నీటితో దానిరెక్కలు కడిగాడు. దాని నోటిలో కొంచెం మంచినీళ్ళను పోశాడు. అది ఎగిరి పోయింది. అది జరిగిన కొన్ని నాళ్ళకే అందమైన ఓ పిల్ల మూసాయీ తల్లి దగ్గరకు వచ్చి అర్థించింది. ఆ కన్యతో మూసాయీకి పెళ్ళి అయిపోయింది.

మూసాయీ మహానందంగా కాలం గడుపుతున్నాడు. అతని భార్య చాలా మంచిది. ఆమె గృహకార్యాలన్నింటినీ తనంతతానుగా చేసుకుపోతున్నది. మూసాయీ తల్లి తన కోడల్ని గురించి ఆ పల్లె అంతా తిరిగి ఎంతో మంచిగా ఘనంగా వర్ణించి చెప్పసాగింది. ఆమె యింటిపనులలో ఎంతమాత్రం కష్టపడవలసి రావడం లేదు.

విధి వైపరీత్యం– ఆ దేశంలో కరువు సంభవించింది. పొలాల్లో ఏమీ పండలేదు. మూసాయీ తల్లినీ, భార్యనూ వెంటబెట్టుకుని కూలిపనికి టోకియో నగరం చేరాడు. అంత తేలికగా అక్కడ కూలిపని దొరుకుతుందా? మూసాయీ దగ్గర డబ్బు అంతా ఖర్చు అయిపోయింది. అతడు ఉపవాసాలు చేయవలసి వచ్చింది. అప్పుడతని భార్య– "నేను నారబట్టలు తయారు చేయగలను. మీరు అవి అమ్మి డబ్బు తీసుకురండి. కాని ఓ షరతు– నేను గదిలో బట్టలు నేస్తుండగా గదిలోకి మీరెవరూ రాకూడదు", అంది.

మూసాయీకి ఆమె పలుకులు అర్థం కాలేదు. తన భార్య నారబట్టలు ఎలా తయారు చేస్తుందో? అతనికి తెలియదు. మూసాయీ సరళ స్వభావం కలవాడు. అతనికి తన భార్య మీద సంపూర్ణ విశ్వాసం ఉంది. అతని భార్య గతంలో ఎన్నడూ అసత్యం ఆడలేదు. పైగా తనదగ్గర డబ్బులుకూడ లేవు. ఏదో రకంగా డబ్బులుంటేనే జీవితం గడుస్తుంది.

మూసాయీ భార్య అభిప్రాయాన్ని మౌనంగా అంగీకరించాడు. తనను ఆమె ఏమీ అడగనప్పుడు ఆమె అభిప్రాయాలతో ఏకీభవించడంలో నష్టం ఏముంది? అతడు తన తల్లితో కూడ చెప్పాడు. "అమ్మా! నా భార్య గది తలుపులు వేసుకుని పనిచేస్తుంటే నువ్వెన్నడూ ఆమెను పిలువకూడదు, గదిలోకి వెళ్ళకూడదు".

పాలవంటి తెల్లని నారబట్టలను మిలమిల లాడేలా పట్టుబట్టలవలె ఆమె తయారుచేసి యిస్తున్నది. మెరిసే ఆ బట్టలు అత్యంత కోమలంగా ఉన్నాయి. ఆ దేశాన్ని పాలించే మికోడేరాజు ఆ నారబట్టలను కొన్నాడు. మూసాయీకి సువర్ణముద్రలు లభించాయి. ఇప్పుడు మూసాయీ ధనవంతుడయ్యాడు. అతని భార్య బట్టలు తయారు చేస్తున్నది, అతడు అమ్ముతున్నాడు.

ఓ నాడు మూసాయీ తనలో "నా భార్య ప్రత్తి తీసుకోవడం లేదు. రంగులూ తేవడం లేదు. ఈ వస్త్రాలు ఎలా తయారు చేస్తున్నదో కదా", అని అనుకున్నాడు.

మూసాయీ ఓనాడు రహస్యంగా కిటికీ సందులో నుండి చూశాడు. అతని భార్య గదితలుపులు అప్పటికే బంధించి ఉంచింది. కానీ లోపల ఆమె లేదు. ఉజ్వల కాంతులతో ప్రకాశిస్తున్న ఓ తెల్లని కొంగ మాత్రం ఉంది. అది తన రెక్కలతో సన్నని దారం తీస్తు పంజాతో వస్త్రాలను నేయసాగింది. దాని కంఠంలో గాయం ఉంది. గాయం నుండి కారే రక్తాన్ని అది పంజాతో చిలుకుతూ వస్త్రంపై చుక్కలు వేయసాగింది. ఆ కొంగయే నా భార్యగా వచ్చి చేసిన ఉపకారానికి యీ రూపంలో ప్రత్యుపకారం

చేస్తున్నదని మూసాయీ గ్రహించాడు.

ఓ చిన్న కొంగ ఉపకారానికి ఎంతటి మహత్తరమైన ప్రత్యుపకారం చేస్తున్నదో కదా! అని అనుకుంటుండగా అతని హృదయం ద్రవించి కనులనుండి జలజల కన్నీరు ప్రవహించింది. ఎక్కడి వాడక్కడ స్తంభించి పోయాడు. "బట్టలు నేసేవేళ ఎవరూ చూడరాదు" అని తన భార్య చెప్పిన విషయాలను అతడు మరచిపోయాడు. అంతేకాదు అతడు తానక్కడ ఎందుకు నిలబడినదీ కూడ మరచాడు.

అదే సమయంలో మూసాయీని తల్లి పిలిచింది. మూసాయీ బిగ్గరగా "వస్తున్నానమ్మా" అని సమాధానం యిస్తూ వెళ్ళాడు. కొంగ ఉలిక్కిపడి కిటికీ గుండా ఎగిరిపోయింది.

"జీవులపై దయచూపే వారికి మహత్తర లాభాలు వస్తాయి"

----oOo----

## 19. సత్యం పలుకు

ఓ బందిపోటు దొంగ ఉన్నాడు. దారులు కాసి, దొంగతనాలు చేసి ప్రజలను కొట్టి, పీడించి వారి ఆభరణాలనూ, ద్రవ్యాన్నీ, విలువైన వస్తువులనూ అపహరించి మాయమవుతుంటాడు. వాడు ఎంతమందిని అంతం చేశాడో ఎవరికీ తెలియదు. ఎన్ని పాపాలు చేశాడో లెక్కయే లేదు.

ఓ స్థానంలో కథా ప్రవచనం కొనసాగుతున్నది. ఓ సాధువు ప్రవచనం చేస్తున్నాడు. చాలా పెద్దపెద్ద వాళ్ళు కథను వినాలని వచ్చారు. ఆ బందిపోటు దొంగ కూడ అక్కడకు వచ్చాడు. కథపూర్తి అయేసరికి రాత్రి అవుతుంది. కథకు వచ్చిన వారిలో బాగా ధనవంతులైన వారు మరలి వెడుతూంటే అందులో ఒకరిని అడ్డగించి లూటీచేస్తాను. అని అతడు మనస్సులో అనుకున్నాడు.

మానవుడు ఎలాంటి వాడైనా అతడు పాల్గొనే సమాజంయొక్క ప్రభావం అవశ్యం వాని మీద పడుతుంది. భగవద్గాథలో లేదా సత్సంగంలో కొన్ని క్షణాలు ఉన్నా లాభమే కలుగుతుంది. ఆ కథవల్ల, సత్సంగంలోని బోధలవల్ల అవశ్యం సత్ప్రభావం కలుగుతుంది.

కథ నాలకించిన తరువాత ఆ బందిపోటుకు సాధువు మంచివాడే అన్న భావం కలిగింది. కథను ఆలకించిన తరువాత వానికి మృత్యుభీతి కలిగింది. మరణానంతరం చేసిన పాపాలకు శిక్షను అనుభవించి తీరాలి. అన్న సాధువచనాలు స్మరిస్తున్న అతనికి మహాభయం వేసింది. వాడు సాధువు దగ్గరకు వెళ్ళాడు. "స్వామీ! నేను బందిపోటు దొంగను. ఈ వృత్తి నన్ను విడిచిపెట్టడం లేదు. నన్ను కూడ ఉద్ధరించే దారి ఏమైనా వుంటే చెప్పండి" అని అర్థించాడు.

సాధువు ఆలోచించి "నువ్వు అబద్ధమాడడం మానివెయ్యి" అన్నాడు.

అందులకు అంగీకరించిన దొంగ స్వగృహానికి మరలి పోయాడు. కథకు వచ్చిన వారందరూ స్వగృహాలకు మరలి పోయారు. బందిపోటు నాడు రాజుగారి భవనంలో దొంగతనానికి బయలుదేరాడు. రాజభవనంచేరి లోపలికి పోబోతుండగా కాపలావాడు అడ్డగించి "నువ్వెవరవు" అని ప్రశ్నించాడు.

ఆ బందిపోటు అబద్ధమాడడం పూర్తిగా మానివేశాడు "నేను బందిపోటు దొంగను", అని బదులు చెప్పాడు.

"ఇతడు రాజభవనానికి సంబంధించిన వ్యక్తి అయి ఉంటాడు. ఇంకా వివరంగా అడిగితే కోపగించవచ్చు" అనుకుంటూ కాపలావాడు దొంగకు దారి యిచ్చేశాడు. "బాబూ! నేను నా విధిని పాటించాను. అంత మాత్రానికి నీకు కోపమెందుకు?" అన్నాడు.

బందిపోటు నిశ్శంకగా భవనంలో ప్రవేశించి ఓ పెద్దపెట్టెను నెత్తిన పెట్టుకుని బయటకు వచ్చాడు. కాపలాదారు ప్రశ్నించాడు, "ఏమిటి తీసుకు పోతున్నావు?".

"ఆభరణాలపెట్టె" వాడు బదులిచ్చాడు. "ఎవరినడిగి తీసుకు పోతున్నావు?" అని ప్రశ్నించాడు.

బందిపోటు అబద్ధం ఆడకూడదు కదా, అతడు సత్యప్రభావాన్ని గ్రహిస్తున్నాడు. కాపలాదారు తనను రాజభవనంలోకి వెళ్ళనిచ్చాడు. అదికూడ సత్యప్రభావమే. లేకుంటే ఎన్నడైనా కాపలాదారుడు తనను లోనికి పోనిస్తాడా? నాటి సాధువును గురించి బందిపోటు హృదయంలో విశేషమైన శ్రద్ధ ఏర్పడింది. వాని భయం మటు మాయమైపోయింది. ఇంత ద్రవ్యాన్ని తీసుకు పోతున్న నేను పట్టుబడక పోతే యిక భవిష్యత్తులో ఎన్నడూ దోపిడీ చేయను. తన దోపిడీ వృత్తి నాటినుండి వానికి హేయంగా గోచరించ సాగింది. కాపలాదారునితో మాట్లాడేవేళ అతడు ఎంతమాత్రం శంకించకుండా నిర్భయంగా భాషించాడు. వానికి సత్యం మీద మహావిశ్వాసం ఏర్పడింది. "దోపిడీ చేసి తీసుకు పోతున్నాను" అన్నాడు.

ఏదో సామాన్య వస్తువై ఉంటుంది. ఇతడు చూస్తే మహాక్రోధ స్వభావం కలవాడుగా కనిపిస్తున్నాడు, అనుకుంటూ కాపలాదారుడు ఆవ్యక్తిని పోనిచ్చాడు. తూర్పుతెల్లవారే సరికి రాజభవనమంతా కోలాహలం బయలుదేరింది. ఆభరణాలుంచిన పెట్టె కనబడడంలేదు. కాపలాదారుని ద్వారా విషయాన్ని గ్రహించి మహారాజు బందిపోటును పట్టించి అడుగగా అతడు సత్యమే చెప్పాడు. అందుకు మహారాజు ప్రసన్నుడయ్యాడు. మహారాజు ఆ బందిపోటును తన భవనానికి ప్రధాన రక్షకునిగా నియమించాడు. ద్రవ్యంకోసం ఇక ఆ దొంగకు లూటీలు చేయవలసిన అవసరం లేదు కదా! అతడు సర్వాధిక మహాపాపమైన అసత్యాన్ని విడనాడాడు. దానితో మిగిలిన పాపాలన్నీ తమంతతామై నశించిపోయాయి.

"అసత్యానికి మించిన పాపరాశి లేదు".

----oOo----

# 20. గొప్ప ధర్మాత్ముడు

ఓ రాజుకు నలుగురు కొడుకులుండేవారు. "ఎవరైతే సర్వాధికుడైన ధర్మాత్ముణ్ణి వెతికి తీసుకువస్తాడో అతడికే రాజ్యాధికారం యీయబడుతుంది" అన్నాడు. రాకుమారులు నలుగురూ గుఱ్ఱాలెక్కి నాలుగు దిశలకూ బయలుదేరారు.

కొన్నాళ్ళు గడిచాయి. పెద్దకొడుకు తిరిగి వచ్చి తండ్రికి ఎదురుగా ఓ శేఠ్‌ను నిలబెట్టి "ప్రభూ! ఈ శేఠ్‌గారు సర్వదా వేలాది రూపాయలు దానం చేస్తూంటారు. వీరు ఎన్నో ఆలయాలు కట్టించారు. చెరువులు త్రవ్వించారు. చలివేంద్రాలు ఏర్పాటు చేశారు. తీర్థక్షేత్రాలలో వీరు ఎన్నో వ్రతాలు కొనసాగిస్తుంటారు. నిత్యం వీరు పురాణ శ్రవణం చేస్తుంటారు. గోపూజలు చేస్తుంటారు. ప్రపంచంలో వీరిని మించిన గొప్ప ధర్మాత్ముడెవడు ఉండడు", అన్నాడు.

"ఈయన నిశ్చయంగా ధర్మాత్ముడే" అని రాజు పలికి ఆ శేఠ్‌ను సత్కరించి పంపివేశాడు.

రెండవ కొడుకు ఓ బక్కచిక్కిన బ్రాహ్మణుణ్ణి తీసుకువచ్చి "ప్రభూ! ఈ బ్రాహ్మణోత్తముడు నాలుగు ధామాలకు, సప్తపురాలకు కాలినడకన వెళ్ళి యాత్రలు చేసివచ్చాడు. సదా వీరు చాంద్రాయణ వ్రతం చేస్తుంటారు. అసత్యానికి వీరు భయపడతారు. ఈయన కోపగించడం ఎవరూ, ఎన్నడూ చూడలేదు. నియమబద్ధంగా మంత్రజపాదులు పూర్తిచేసుకున్న తరువాతనే జలపానం చేస్తారు. త్రికాలాల్లోనూ స్నానంచేసి సంధ్యావందనం చేస్తారు. ఈ కాలంలో యీ విశ్వంలో వీరిని మించి సర్వశ్రేష్ఠ ధర్మాత్ములెవరూ మరిలేరు", అన్నాడు.

రాజు బ్రాహ్మణదేవతకు నమస్కరించి అధిక దక్షిణలిచ్చి "వీరూ మంచి ధర్మాత్ములే" అంటూ పంపివేశాడు.

మూడవ కొడుకు కూడ మరలి వచ్చాడు. అతనితో కూడ ఓ బాబాజీ ఉన్నారు. ఆ బాబాజీ వస్తూనే ఆసనం వేసుకుని కళ్ళు మూసుకుని కూర్చుండి పోయారు. జీర్ణమైన బట్టలతో అస్థిపంజరంలా ఉన్న ఆకారంతో ఆయన కనిపిస్తున్నాడు. అందరూ ఆసీనులైన తరువాత మూడవ కొడుకు– "ప్రభూ! వీరు ఎంతగానో నేను ప్రార్థించగా యిక్కడకు విచ్చేశారు. వీరు మహాతపస్వులు. వారానికి ఒక్కసారి మాత్రమే క్షీరపానం చేస్తారు. గ్రీష్మఋతువులో పంచాగ్ని మధ్యంలో ఉంటారు. శీతకాలంలో జలాలలో నిలబడుతారు. సదా భగవంతుని ధ్యానంలో వుండే వీరికి మించిన మహాధర్మాత్ములు లభించడం దుర్లభమే", అన్నాడు. రాజు ఆ మహాత్మునికి సాష్టాంగప్రణామంచేసి వారి ఆశీస్సులు అందుకుని వీడ్కోలు పలికాడు. ఆపై! వీరూ ధర్మాత్ములే అన్నాడు.

అందరి తరువాత చిన్నకొడుకు వచ్చాడు. అతనితో మాసిన బట్టలు కట్టుకున్న పల్లెలో నివసించే ఓ రైతు ఉన్నాడు. దూరం నుండియే రాజుకు దండాలు పెడుతూ భయపడుతూ ఆ రైతు వచ్చి నిలబడ్డాడు, అన్నలు ముగ్గురూ తమ్ముని మూర్ఖత్వానికి పకపక నవ్వారు. అప్పుడా చిన్నవాడందుకుని– "ప్రభూ! ఓ కుక్కకు గాయం తగిలింది. ఇతడది చూసి దాని గాయం కడిగాడు. అంత నేనితణ్ణి తీసుకువచ్చాను. ఇతడు ధర్మాత్ముడవునో కాదో మీరే అడిగి తెలుసుకోండి", అన్నాడు.

రాజు అడిగాడు, "ఏమయ్యా! నువ్వు ఏం ధర్మం చేస్తుంటావు?".

భయపడుతూనే రైతు పలికాడు "ప్రభూ! నేను చదువుకున్నవాణ్ణి కాను. నాకు ధర్మం అంటే ఏం తెలుస్తుంది? ఎవరైనా జబ్బుపడితే సేవచేస్తాను. ఎవరైనా యాచిస్తే గుప్పెడు మెతుకులు పెడతాను".

అంతరాజు "ఇతడే అందిరికన్న గొప్పధర్మాత్ముడు" అనగావిని కొడుకులందరూ అటూ యిటూ చూడ సాగారు. రాజు ఇలా అన్నాడు –"దానధర్మాలు చేయడం, గోపూజ చేయడం, అసత్యమాడక పోవడం, క్రోధంగా ఉండక పోవడం, తీర్థయాత్రలు, సంధ్యావందనం పూజాదులు

కొనసాగించడం కూడ ధర్మమే. తపస్సు చేయడం అవశ్యమైన ధర్మమే కానీ సర్వాధిక ధర్మమేమంటే అర్థించక పోయినా అసహాయ స్థితిలో ఉన్న వారిని ఆదుకోవడం, రోగికి సేవచేయడం, కష్టంలో ఉన్న వారికి చేయూతనీయడం సర్వాధికమైన ధర్మము, పరులకు సహకరించే వానికి తనంతతానుగా సహాయం అందుతుంది. త్రిలోక నాథుడైన పరమాత్మ అట్టి పరోపకార పరాయణునిపై ప్రసన్నుడై ఉంటాడు.

"పరోపకారాన్ని మించిన పరమ ధర్మం లేదు".

-----oOo-----

## 21. నరకయాత్ర

"ఇది దారుణ భయంకర నరకమే" యుధిష్ఠిర మహారాజుకు యమరాజు దూతలు నరకాన్ని చూపిస్తున్నారు. యుధిష్ఠిర మహారాజు జీవితంలో ఒకేఒకసారి సగం అబద్ధం ఆడాడు. "అశ్వత్థామ హతః, కుంజరః" అశ్వత్థామ హతమయ్యాడు– మనిషి కాదు ఏనుగు. సత్యాన్ని యీ విధంగా త్రిప్పి త్రిప్పి చెప్పడంవల్ల యుధిష్ఠిరుడు నరకాన్ని దర్శించవలసిన శిక్షను పొందాడు.

అతడనేక నరకాలు చూశాడు. ఒకచో ఒకణ్ణి తేళ్ళుకుడుతూ, పాములు కరుస్తున్నాయి. మరొకచో ఓ పాపిని బ్రతికి ఉండగానే కుక్కలూ, నక్కలూ పీక్కుని తింటూన్నాయి. మరొకచో కొందరిని యమభటులు అంపాలతో చీలుస్తున్నారు. కొందరిని కాగే నూనెలో వేయించి వేస్తున్నారు. ఆ రీతిగా పాపులకు తీవ్రమైన శిక్షలు విధింపబడుతున్నాయి.

యుధిష్ఠిరుడు యమదూతలను ప్రశ్నించాడు, ఇవి మహాభయంకరమైన శిక్షలే, ఎలాంటి వారు యిక్కడ యీ దారుణమైన శిక్షలు అనుభవిస్తారు.

అక్కడ జీవులు హాహాకారాలు చేస్తున్నారు. గట్టిగా అరుస్తూ

ఏడుస్తున్నారు. కానీ యుధిష్ఠిరుడు అక్కడ ఉండడంవల్ల వారికష్టాలు తొలిగాయి. వారన్నారు "మీరిక్కడే ఉండి పోండి" యుధిష్ఠిరుడు అక్కడే ఆగిపోయాడు. అప్పుడు యమధర్మరాజు, మహేంద్రుడువచ్చి- "రాజా! నువ్వొకసారి కపట భావంతో మాట్లాడినావు. అందులకే నువ్వు కేవలం దర్శనార్థం నరకయాత్ర చేయవలసి వచ్చింది. మీకు సంబంధించినవారు కానీ, పరిచితులు కానీ యిక్కడెవరూ లేరు. మానవజన్మ నెత్తికూడ పాపాలుచేస్తూ, పరోపకారం చేయకుండ వుండునట్టివారూ, పరులను పీడించునట్టివారూ నరకాలలో పడతారు", అన్నారు.

-----oOo-----

## 22: దెబ్బలు తిన్న డాక్టరు

ఓ డాక్టరు గారున్నారు. ఓ ప్రఖ్యాత నగరంలో ఆయన నివసిస్తున్నారు. గుంపులు గుంపులుగా ఆయన దగ్గర రోగులు గుమిగూడుతుంటారు. ఇంటికి రప్పించుకోవాలంటే ఆయనకు ఎక్కువ ఫీజు చెల్లించాలి. ఆయనకు పేరు కూడ చాల వచ్చింది. ఆయన దగ్గర మందు తీసుకుంటే చాలు ఎలాంటి రోగమైన నయమవుతుంది.

పేదవాడెవడు పిలచినా ఆ డాక్టర్‌గారు వెంటనే ఆయన తన టాంగా ఎక్కి రోగినిచూడ వెళ్ళేవాడు. పేదవాళ్ళ దగ్గర ఆయన డబ్బుతీసుకో కుండానే మందు యిచ్చేవాడు. అవసరమైతే రోగికి పాలనిమిత్తం కొంచెము డబ్బులు కూడ యిచ్చేవాడు.

డాక్టర్ సాహబ్ చెప్పేవాడు అవి మా నాన్నగారు బ్రతికున్న రోజులు. నేను కొత్తగా హాస్పిటల్ పెట్టిన కాలం అది. నా వృత్తి బాగా కొనసాగుతున్నది. ఓ నాడు దూరగ్రామం నుండి ఓ రైతువచ్చి- "డాక్టర్‌బాబూ! నా భార్యకు చాలా జబ్బుగా ఉంది. దయచేసి మా యింటికి వచ్చి చూడండి" అని కోరాడు.

డాక్టర్ అన్నాడు, "అంతదూరం నేను కనీసం యిరువది రూపాయలు యిస్తేనే కాని రాజాలను. నా ఫీజు ముందిక్కడ చెల్లించి టాంగా తీసుకురా అప్పుడు నేను వస్తాను".

ఆ రైతు పాపం చాలా పేదవాడు. అతడు డాక్టర్ పాదాల వద్ద ఐదురూపాయలు మాత్రం వుంచి ఏడుస్తూ "నా దగ్గర డబ్బులు లేవు బాబూ! తమరు మా యింటికి దయచేయండి. నేను టాంగా తీసుకువస్తాను. పంటలు రాగానే మీ పదిహేను రూపాయలు యిచ్చేస్తాను". అన్నాడు.

డాక్ట ఆరైతుపై విరుచుకుపడి వాడిచ్చిన ఐదు రూపాయలు విసరివేస్తూ "నీలాంటి బిచ్చగాళ్ళ కోసం నేను హాస్పిటల్ పెట్టలేదు. నాచే చికిత్స చేయించుకోదలచిన వారు ముందే ద్రవ్యం ఏర్పాటు చేసుకురావాలి. నీలాంటి వాళ్ళతో మాట్లాడడానికి నాకు సావకాశం లేదు" అన్నాడు.

రైతు గిలగిల లాడిపోతూ ఏడుస్తూ "డాక్టర్ బాబూ! మా వూళ్ళో ఎవరి దగ్గరైనా అప్పు తీసుకునైనా నేను మీ డబ్బులు చెల్లిస్తాను. త్వరగా రండి. లేకపోతే నా భార్య చనిపోతుంది. పిల్లలందరూ అనాధలైపోతారు. నా కుటుంబం నాశనమై పోతుంది" అన్నాడు.

రైతు మాటలు విని డాక్టర్ విసుక్కుంటూ కోపంగా– నీ కుటుంబం నరకంలోకి పోయినా నాకు బాధలేదు, నాకు డబ్బు యిస్తేనే వస్తాను; అన్నాడు.

డాక్టర్ తండ్రి మేడపైభాగం నుండి అంతా వింటున్నాడు. ఆయన కొడుకును పిలిచాడు. డాక్టర్ తండ్రిదగ్గరకు వెళ్ళాడో లేదో అతని చెంప చెళ్ళుమంది. ఆ గట్టి దెబ్బకు తలతిరిగి డాక్టర్ నేలమీద పడ్డాడు.

తండ్రి అన్నాడు, "పేదవాళ్ళ పట్ల నువ్వు యింత దయాశూన్యంగా వ్యవహరించడానికి నేను నిన్ను చదివించలేదు. వాళ్ళను తిట్టి సర్వనాశనానికి కారకుడవు అవుతావా? పో. ఇప్పుడే నా ఇంట్లో నుండి వెంటనే వెళ్ళిపో. నీ పోషణకు, చదువు చెప్పినందుకూ అయిన ఖర్చు

లెక్కలు కట్టి చెల్లించి మరీ వెళ్ళు. లేకపోతే మారుమాట చెప్పకుండా టాంగా మీద ఆ పేదరైతుతో పల్లెకు వెళ్ళు. అతని దగ్గర నువ్వు ఒక్క పైస తీసుకున్నా కిరసనాయిలు పోసి నేను నీ హాస్పిటల్ తగల బెడతాను. డాక్టర్ చేతులు జోడించాడు. అంత అతని తండ్రి కొద్దిగా శాంతించి "నా కోడలు జబ్బు పడగా నీ చేతిలో చిల్లిగవ్వ లేకుంటే నువ్వు ఓ డాక్టర్ దగ్గరకు వెళ్ళి అతణ్ణి ప్రార్థించగా నువ్విచ్చిన జవాబే డాక్టరు యిస్తే నీ కెంత దుఃఖం కలుగుతుందో యోచించు. తనకు ఎలా కావాలనుకుంటాడో మానవుడు యితరుల విషయములో కూడ అలాగే వ్యవహరించాలి. అలా నువ్వు వ్యవహరించగలిగితే పేదవాళ్ళ ఆశీస్సులు పొంది నువ్వు సర్వవిధాలా వర్ధిల్లుతావు.

పాపం ఓ మూల డాక్టర్ దవడవాచి పోయింది. అతడు తలవంచి తండ్రి ఆదేశానుసారం కావలసిన మందులపెట్టె టాంగాలో సర్దించి ఆ రైతును తీసుకుని బయలుదేరాడు". అతడంటూ వుంటాడు కూడ- "ఏ పేదరోగి వచ్చినా నాకు మా నాన్నగారి ఆ మూర్తి స్మృతిలో మెదులుతుంది. వెంటనే నాటి ఆయన ఉపదేశవాక్యాలు నా చెవులలో ప్రతిధ్వనిస్తాయి. ఆ నా తండ్రి ధన్యుడు కదా!".

-----oOo-----

## 23. మనిషా? పశువా?

ఇది వాస్తవంగా జరిగిన సంఘటన. నేను పేరు చెప్పను. అనేక మంది విద్యార్థులు పాఠశాలనుండి బయటకు వచ్చారు. మధ్యాహ్నం వేళ శెలవు యిచ్చారు. పిల్లలందరూ కేరింతలు కొడుతూ నవ్వుతూ, అరుస్తూ పోతున్నారు. పాఠశాల ప్రధానద్వారం దగ్గర ఓ మనిషి నేలమీద పరున్నాడు. ఎవరూ అతనివైపు చూడలేదు. అందరికందరూ తమ ధోరణిలో ముందుకు దూసుకుపోతున్నారు.

ఓ చిన్నపిల్లవాడు ఆ వ్యక్తిని చూశాడు. రోగంతో ఆ మనిషి

బాధపడుతున్నాడు. చిన్నపిల్లవాణ్ణి చూస్తూనే అతడు మంచినీళ్ళు కావాలన్నాడు. ఆ కుర్రాడు దగ్గరగా ఉన్న యింటికివెళ్ళి నీళ్ళు తెచ్చి యిచ్చాడు. నీళ్ళు త్రాగి ఆ రోగి మరల పడుకున్నాడు. నీళ్ళు యిచ్చిన వారి చెంబు మరల వారికిచ్చివేసి ఆ పిల్లవాడు ఆడుకునేందుకు వెళ్ళిపోయాడు.

సాయంకాలం ఆ పిల్లవాడు యింటికి మరలి వచ్చాడు. అదే సమయంలో ఓ సజ్జనుడు వచ్చి అతని తండ్రితో "పాఠశాలకు ఎదురుగా రెండు ఝాముల తరువాత ఓ వ్యక్తి రోడ్డుమీదపడి చనిపోయాడు" అన్న మాటలు వింటూనే పిల్లవాడు "బాబూజీ! ఆయనెవరో తెలియదు రోడ్డుమీద పడిఉన్నాడు, కోరగా ఆయనకు నేను మంచినీళ్ళు తెచ్చియిచ్చాను" అన్నాడు.

తండ్రి చాలా కోప్పడ్డాడు. "నువ్వు నా దగ్గర వుండకు పో. రోగి బాధ పడుతుంటే కూడ చూసి నువ్వు వాణ్ణి వదలి వచ్చేస్తావా? అతణ్ణి హాస్పిటల్‌కు తీసుకువెళ్ళక ఎందుకు విడిచి వచ్చేశావు? నువ్వు మనిషివి కాదు, పశువువు".

భయపడుతూనే ఆ కుర్రవాడు– "నాన్నగారూ! నేను ఒంటరి వాణ్ణి అంత పెద్దవాణ్ణి హాస్పిటల్‌కు ఎలా తీసుకు వెళ్ళగలను?".

తండ్రి గద్దిస్తూ అన్నాడు, "వంకలు పెట్టి తప్పించుకోకు. నువ్వొక్కడవు తీసుకు వెళ్ళలేకపోతే మీ మేస్టారుకు చెప్పి తీసుకువెళ్ళవచ్చును, లేదా వెంటనే వచ్చి నాకు చెప్పినా నేను తగిన ఏర్పాట్లు చేద్దును కదా! నువ్వు చేసేదేమిటో ఆలోచించుకో. రోగిని గాయపడిన వాణ్ణి, లేదా దుఃఖిస్తున్న వాణ్ణి చూసి శక్తివంచన లేకుండ సహకరిస్తావా? లేక వెళ్ళిపోతావా? నువ్వు మనిషివో లేక పశువువో అప్పుడే నీకు తెలుస్తుంది.

-----oOo-----

## 24. సంతోషానికి ఫలం

విదేశంలో కరువు వచ్చింది. ప్రజలు విశేషంగా ఆకలితో చచ్చిపోతున్నారు. ఓ చిన్న నగరంలో ధనవంతుడైన దయగల ఓ వ్యక్తి ఉన్నాడు. అతడు నగరంలోని చిన్న పిల్లలందరికీ రోజూ ఓ చిన్న రొట్టె యిస్తానని చాటింపు వేయించాడు. మరునాడు ఓ తోటలో పిల్లలందరూ సమావేశమయ్యారు. వారికి రొట్టెలను పంచిపెడుతున్నారు.

రొట్టెలలో చిన్నా, పెద్దా ఉన్నాయి. పిల్లలందరూ తమలో తాము కలహించుకుంటూ గెంటుకుంటూ అందరికందరూ తాము పెద్ద రొట్టెలను తీసుకోవాలని ప్రయత్నిస్తున్నారు. ఓ చిన్న పిల్ల మాత్రం మౌనంగా దూరంగా నిలబడి ఉంది. అందరూ వెళ్ళాక ఆ పిల్లముందుకు వచ్చింది. బుట్టలో అన్నిటికంటె చిన్నరొట్టె మిగిలింది. ఆమె దానిని ఆనందంగా తీసుకుని యింటికి వెళ్ళిపోయింది

మరునాడూ రొట్టెలు పంచబడ్డాయి. పాపం! ఆ చిన్నపిల్లకు ఆ నాడు కూడ చిన్నరొట్టె దొరికింది. ఆ పిల్ల యింటికి వచ్చి తిందామని రొట్టె విరిచేసరికి అందులో నుండి ఓ బంగారు కాసు బయట పడింది. అది చూసి ఆమె తల్లి– "అమ్మా! ఈ కాసు పట్టుకెళ్లి ఆ శ్రీమంతునికి యిచ్చిరా! అనగావిని ఆ పిల్ల అక్కడకు పరుగుతీసింది.

ఆమెను చూసి ఆ శ్రీమంతుడు "పాపా! ఎందుకు వచ్చావమ్మా?" అని ప్రశ్నించాడు. బాబుగారూ "నా రొట్టెలో ఈ కాసు వుందండి పిండిలో పడిపోయి వుంటుంది. ఇద్దామని వచ్చాను. మీ కాసు మీరు తీసుకోండి" అంది ఆ చిన్న పిల్ల.

శ్రీమంతుడు– "లేదమ్మా! ఇది నీ సంతోషానికి బహుమానం".

ఆ పిల్ల తల ఆడిస్తూ అంది "బాబుగారు నా సంతోషానికి బహుమానం అప్పుడే దొరికింది. అందరిలా నేను త్రొక్కిసలాటలో దెబ్బలు

తినవలసి రాలేదు".

ఆ శ్రీమంతుడు మహానందం చెందాడు. అతడామెను దత్తత చేసుకున్నాడు. ఆ పిల్ల తల్లికి నెలకు కావలసిన ద్రవ్యం పంపసాగాడు. ఆ పిల్లయే ఆ శ్రీమంతునికి ఉత్తరాధికారిణి అయ్యింది.

----oOo----

## 25. అసభ్యాచారం

ఓ గ్రామంలో ఓ పిల్లవాడుండే వాడు. చదువుకోసం వాని తండ్రి అతణ్ణి కాశీనగరానికి పంపాడు. ఆ విద్యార్థి చదవడంలో విశేష పరిశ్రమ చేశాడు. విప్రకులంలో పుట్టాడు, పైగా వాని బుద్ధి నిశితమైనది. కాశీనుండి అతడు మరలి వచ్చేసరికి స్వగ్రామంలోనే అతడు వ్యాకరణాచార్యుడయ్యాడు. ఆ గ్రామంలో అతనిలా చదువుకున్నవారు లేరుకూడ. అందుకే అందరికందరూ అతణ్ణి గౌరవించసాగారు. దానితో అతని గర్వం రెట్టింపు అయిపోయింది. ఓ సారి ఆ గ్రామంలోకి పెళ్ళిబృందం వచ్చింది. ఆ బృందంలో యిద్దరు ముగ్గురు వృద్ధపండితులు కూడ వచ్చారు. ఆ కాలంలో వివాహవేళలో శాస్త్రచర్చలు జరుగుతుండేవి. అందరూ కూర్చున్న తరువాత శాస్త్రచర్చ సమయం వచ్చింది.

సర్వప్రథమంగా ఆ గర్వి అయిన యువకుడే ప్రశ్నించాడు. పండితులు సావధానంగా సమాధానం చెప్పారు. అప్పుడు వృద్ధపండితులలో నుండి ఒకరు యువకుని ప్రశ్నించారు– అసభ్యులని ఎవరినంటారు?.

యువకుడు మహా దర్పాన్ని ప్రదర్శిస్తూ "పెద్దలను గౌరవించక, వారి సమక్షంలో ఉద్దండంగా వ్యవహరించే వారిని అసభ్యులంటారు", అన్నాడు.

తమరు ఈ విషయాన్ని కూడ అంగీకరిస్తారనుకుంటాను. "అసభ్యులతో భాషించే వారు కూడ అసభ్యులే అవుతారు కదా!".

"నిశ్చయంగా" యువకుడు ఆవేశంగా సమాధానం యిచ్చారు.

"అయితే నేను మీతో భాషించడం ఆపుచేస్తున్నాను" అంటూ వృద్ధ పండితుడు చిరునవ్వు నవ్వారు.

"అంటే?" యువకుడు కోపంతో కళ్ళెర్రచేసి ప్రశ్నించాడు.

"గౌరవనీయులయిన మీ తండ్రిగారు వెనుక కూర్చుని ఉండగా మీరు ముందుకు వచ్చి కూర్చున్నారు. వారిని ఓ సారి యిలా పిలవండి" పండితుడు వేళాకోళం చేశాడు.

"నేను ఆచార్యుణ్ణి" యువకుడు అరిచాడు. వృద్ధుడు నవ్వుతూ "ఆచార్యుడైనంత మాత్రంచే సభ్యుడు కావాలని లేదే, మీకింకా ధీమంతుల సాంగత్యం లభించినట్లు లేదు". యువకుని తండ్రి అతనికన్న మిన్నగా సిగ్గుపడ్డాడు.

-----oOo-----

# 26. సర్వస్వ దానం

ఓ పురాతన దేవాలయం ఉంది. శిథిలాలు ఏర్పడ్డాయి. బాగా గాలి వీచి విశేషంగా వర్షం కురిసింది. ఆలయంలోని చాలభాగం ఛిన్నాభిన్నమై నేలమీద పడిపోయింది. నాడు ఓ సాధువు వర్షంలోనే ఆ దేవాలయంలోకి వచ్చి బసచేశాడు. అతడు కూర్చున్నభాగం మాత్రం కూలిపోలేదు. దానివల్ల ఆసాధువు బ్రతికాడు.

సాధువు దగ్గరగా ఉన్న బజారులో చందాలు వసూలుచేయ ప్రారంభిచాడు. "నేనుండగా ఆలయం కూలింది, కనుక నేను దీనిని ఉద్ధరించే ఎక్కడికైనా వెడతాను", అనుకున్నాడు.

బజారులో ఉండే వారందరూ భక్తి శ్రద్ధలు కలవారే. సాధువు మంచి విద్వాంసుడు. ఇంటింటికీ వెళ్ళి అతడు చందాలు ప్రోగుచేశాడు. ఆలయం తయారయింది. భగవద్విగ్రహానికి మహోత్సవంతో పూజ జరిగింది. కుంభాభిషేకం జరిగింది. సర్వులూ దైవ ప్రసాదాన్ని ఆనందంగా స్వీకరించారు.

కుంభాభిషేకం జరిగిన రోజు సాయంకాలం సభ జరిగింది. సాధువు బాబా దాతలందరికీ ధన్యవాదాలు అర్పించాలని నిండు సభలో లేచి నిలబడ్డాడు. అతని చేతిలో ఓ కాగితం ఉంది. అందులో పెద్ద వరుసలో పేర్లు వ్రాయబడ్డాయి. సాధువు చదవడం ఆరంభించాడు, సభాసదులారా! అందరికన్న ముందుగా ఓ వృద్ధమాత తనంతతానుగా వచ్చి ద్రవ్యం యిచ్చింది. ఎవరో ముసలావిడ వందో రెండువందలో యిచ్చి ఉంటుందనుకున్నారు ప్రజలు. కానీ, బాబా చెప్పగా అందరికీ మహాశ్చర్యం వేసింది. "ఆ తల్లి నాకు ఓ పావలా, కొంచెం పిండీ దానం ఛేసింది". సాధువు వేళాకోళమాడుతున్నాడను కున్నారు ప్రజలు. ఆపై సాధువు అన్నాడు– "ఆమె పొరుగిళ్ళకు పోయి పిండివిసిరి ఆ కూలి డబ్బులతో జీవిస్తున్నది. ఎన్నో రోజులకు ఆమె యీ పావలా డబ్బులను పోగు చేయగలిగింది. ఆమెకున్నదంతా ఆ పావలాయే. తన సర్వస్వాన్నీ

దానంచేసిన ఆ శ్రద్ధాళువైన వృద్ధమాతకు నేను సర్వప్రథమంగా ప్రణమిల్లుతున్నాను.

ప్రజలు తలలు దించుకున్నారు. ఆ వృద్ధురాలు మనసా తన సర్వస్వాన్ని యిచ్చిన దానమే సర్వదానాలలో శ్రేష్ఠమైనదైనది.

-----000-----

## 27. బందిపోటు రోదిస్తే

ఇది దక్షిణ అమెరికాలో జరిగిన సంఘటన. ఆ కాలంలో అక్కడ బంగారపు గనులు బయటపడేవి. దూరదేశాలనుండి అనేకమంది వ్యాపారులు, కూలివారు కూడ అక్కడకు చేరేవారు. క్రమేణా ఉత్పత్తి తగ్గసాగింది. అప్పటికే దూర ప్రాంతీయులు అక్కడకు చేరి ఉన్నారు. కరువు వచ్చింది. అన్నవస్త్రాల ధర పెరిగిపోయింది. పాడైన పదార్థాలతోనే జనులు కడుపులు నింపుకుంటూ కాలక్షేపం చేస్తున్నారు. కలరా వ్యాపించింది, జ్వరాలు మొదటినుండీ పీడిస్తున్నాయి.

బాధితులకు సేవలందించే ముక్తిసేన అక్కడకు తన బృందాన్ని పంపింది. ఆ సంస్థను స్థాపించిన సంస్థాపకురాలు కూడ అక్కడకు వచ్చింది. బందిపోట్ల బాధ విశేషంగా వుందని ప్రజలు చెప్పారు. కానీ "ముక్తిసేన" కేవలం సేవలందించడానికి మాత్రమే అక్కడకు వచ్చింది. వారి బృందం నిర్భయంగా ముందుకు వెళ్ళసాగింది. చెట్లక్రింద వారు డేరావేశారు. వైద్యబృందం రోగులకు సేవలందించసాగారు. ఓ రోజున అక్కడకు ఆయుధధారి అయిన ఓ ఆశ్వికుడు వచ్చాడు. ఆ సేవాదళ సంస్థాపకురాలికి అతడు ఓ చీటి ఓ కంబళీ యిచ్చి వెళ్ళాడు. ఆ కాలంలో ఓ మంచి కంబళీ యివ్వడమంటె అది గొప్ప విషయమే. ఆ వ్యక్తి చీటికి సమాధానం తీసుకుని వెళ్ళి పోయాడు.

మరునాడు ఓ అందమైన యువకుడు గుఱ్ఱంమీద వచ్చాడు.

మహిమాన్వితురాలైన ఆ నారీమణి ముందు మోకాళ్ళపై కూర్చున్నాడు. మీరు నా కంబళిని అందుకుని నా పై విశేషంగా కృపను చూపారు. సర్వుల సేవలో నిమగ్నులైన మీరు యీ అధమునికి అల్పసేవచేసే అవకాశాన్ని యిచ్చారు.

ఆ నారీమణి పలికింది. "భగవత్ప్రార్థనలో నాతో కలిసి వుండడం నీకు సమ్మతమేనా?"

అతడు వెంటనే అంగీకరించాడు. పాషాణ హృదయుడు, పిశాచి అని ప్రజలందరూ ఎవణ్ణి గురించి అనుకునే వారో? వాడే నాడు ప్రార్థనలో పిల్లవాడు వెక్కి వెక్కి ఏడ్చినట్లు ఏడ్చాడు. వాడే ఆ బందిపోటు బృందానికి ప్రధాన నాయకుడు.

----oOo----

## 28. నేను మనిషినౌతాను

ఒకానొక సమయంలో బ్రహ్మదేవుడు ఓ దేవతపై ప్రసన్నుడయ్యాడు. ఆ దేవతను అంతకుముందే దుర్వాసమహర్షి- "నువ్వింక దేవతగా వుండ జాలవు" అని శపించాడు. అప్పుడా దేవత "స్వామీ! చిరకాలం నేను అమరుడనై యున్నాను. స్వర్గభోగాలతో విసిగి పోయాను", అని పితామహ బ్రహ్మతో పలుకగా బ్రహ్మదేవుడు ప్రసన్నుడై "నువ్వు ఎలా కావాలనుకుంటే నేను నిన్ను అలాగే చేస్తాను", అన్నాడు.

ఆ దేవత కొంచెంసేపు యోచించి పలికాడు "ఓ సారి నన్ను లోకాలన్నీ తిరిగి రానీయండి".

బ్రహ్మదేవుడు అంగీకరించాడు. అమరుడు దేవలోకంలో చూసేదేమున్నది? ఆడి పాడే గంధర్వయక్ష కిన్నరులందరూ అతని ముందు సేవకులే కదా! దేవరాజైన ఇంద్రుని నందనోద్యానవనంలోని పారిజాత

వృక్షాదులను అతడెన్నోసార్లు చూడనేచూచాడు. అతడు పై లోకాలకు వెళ్ళాడు. జన, తపోలోకాలు చూశాడు. ఆపై మహర్లోక, సత్యలోకాలూ చూశాడు. వైకుంఠ, సాకేత, గోలోక, శివలోకాలు తిలకించడానికి అతనికి అనుమతి లభించలేదు. ఆ లోకాలలో అడుగుపెట్టాలంటే ఋషియై తపస్సుచెయ్యాలి. అక్కడ భోగాలుండవు. అమరుడనైన నేను స్వర్గభోగాలు, అనుభవించాను. ఇప్పుడీ యిబ్బందిలో ఎక్కడ చిక్కుకుందును?.

ఈ విధంగా భావించి అతడు సరాసరి పాతాళంవైపు బయలుదేరాడు. అతడు దైత్యుల బలాలకు సంబంధించిన ప్రశంసలు విని ఉన్నాడు. నాగలోకాన్ని చూస్తూనే అతడు భయపడి పోయాడు. అక్కడ మహా మహా సర్పాలున్నాయి. అతడక్కడ దైత్యులను చూశాడు. వారు నల్లగా కురూపులై భయంకరంగా ఉన్నారు. అట్టి కురూపిగా తయారు కావడానికి ఇష్టపడక ఆ దేవత పృథ్వీమీదకు వచ్చాడు.

"నేను పక్షినై ఎగురుతూ తిరుగుతాను. నచ్చిన పళ్ళను తిని స్వేచ్ఛగా సంచరిస్తాను. అని అతడనుకుంటుండగా ఓ విమానం మహావేగంతో ఎగరడం చూశాడు. "ఓహో! మానవుడు యితడూ ఎగురుతున్నాడే? అతనికి భయం వేసింది. పక్షినై ఎగురుతున్నవేళ మానవుడెవడైనా తుపాకీతో పక్షిని కాల్చవచ్చును".

నేను జలాలలో నివసిస్తాను. కానీ జలాలపై ఓడలూ జలాలలో జలాంతర్గాములూ తిరుగుతుంటాయి. ఇక్కడ కూడ మానవుని వల్ల భయం కలుగుతుంది. జలాలలో కూడ జలజంతువులు పరస్పరం దండెత్తి అంతం చేసుకుంటూ ఉంటాయి.

"ఏనుగు సింహం ఆదిగాగల మహాబలం గల జంతువులను చూశాడు. వాటిని కూడ మానవుడు బంధించి తనసేవకు వినియోగించు కుంటున్నాడు. నేలపై మానవుడు రైలుమీద, కారుమీద శరవేగంతో పురోగమిస్తున్నాడు. నీరు, గాలి, విద్యుత్ వీటితో కూడ కార్యాలను

సాధించుకుంటున్నాడు. వేలాది క్రోసుల దూరంలో జరిగే సమాచారాన్ని వింటూ, దృశ్యాలను చూడగలుగుతున్నాడు. మానవుడు మహాధీశాలి సుందరుడు కూడ అని ఆ దేవత ఆలోచిస్తూ వెనుదిరిగాడు.

"వైకుంఠ, సాకేత, గోలోక, శివలోకాలు ఎలా ఉంటాయి? అక్కడ ఏమి ఉన్నాయి". అమరుడు బ్రహ్మదేవుణ్ణి ప్రశ్నించాడు.

"ఆ లోకాలు మహావిచిత్రంగా ఉన్నాయి. అక్కడ యిక్కడి సూర్యచంద్రుల ప్రకాశంలేదు. అవి తమ తేజస్సుతోనే ప్రకాశిస్తున్నాయి. అక్కడ భగవంతుడు అతని భక్తులు మాత్రమే ఉన్నారు. అక్కడ శాశ్వతమైన సుఖం లభిస్తుంది. నిత్యమైన సౌందర్యం శోభిల్లుతూ ఉంటుంది. అక్కడ దుఃఖం నామమాత్రంగా కూడలేదు" అని బ్రహ్మదేవుడు సమాధానమిచ్చాడు.

బ్రహ్మదేవుడు అతణ్ణి మాట్లాడనీయలేదు. ఆయన మధ్యలోనే అందుకుని- "అక్కడకు మానవుడు తన భక్తిసాధనల ద్వారా మాత్రమే వెళ్ళగలుగుతాడు" అన్నాడు.

"అయితే స్వామీ! నేను మనుష్యుడనవుతాను" అన్నాడు దేవత వెంటనే. బ్రహ్మదేవుడు ప్రసన్నుడు కాకుంటే తానేమీ కాలేడు. మానవుడు అమరుడుగానూ మారగలడు.

బ్రహ్మదేవుడు అమరుణ్ణి మనుష్యునిగా మార్చి అన్నాడు-
"సందేహాన్ని మించినది మరేదీ లేదు"

-----oOo-----

## 29. తిట్లు దగ్గరే ఉండిపోయాయి

ఓ దుష్టుడైన కుఱ్ఱవాడున్నాడు. వాడు ఎవరినైనా సరే తిట్టి పారిపోతుంటాడు. ఓనాడు ఓ సాధుబాబా ఓ మఱ్ఱిచెట్టు క్రింద కూర్చుని ఉన్నాడు. ఆ కుఱ్ఱవాడు వచ్చి అతణ్ణి దూషించి పారిపోయాడు. తిట్టడం వల్ల సాధువు కుపితుడై తనను కొట్టడానికి పరుగెత్తుకు వస్తాడనీ, అప్పుడు మహామజాగా ఉంటుందనీ వాడనుకున్నాడు. సాధువు మౌనంగా కూర్చున్నాడు. అతడు వాడివైపు చూడనైనా లేదు.

ఆ కుఱ్ఱవాడు ఆ సాధువుకు మరీ దగ్గరగా వచ్చి మరల ంగా దూషించ సాగాడు. సాధువు తన ధ్యానములో లీనమై ఉన్నాడు. ఏదో కుక్కయో, కాకియో అరుచుకుంటున్నదని ఆ బాబా అనుకున్నాడు. అక్కడకు మరో కుఱ్ఱవాడు వచ్చి- "బాబాజీ! వీడు మిమ్మల్ని తిడుతున్నాడు కదా!" అని అడిగాడు. బాబాజీ సమాధానం యిచ్చాడు. అవును నాయనా! దూషిస్తున్నాడు. కాని, నేను ఆ తిట్లను స్వీకరిస్తేకదా! నేను వాటిని పట్టించుకోనప్పుడు ఆ తిట్లన్నీ వాడిదగ్గరే ఉంటాయి కదా.

"కానీ వాడు చాలా చెడుతిట్లు తిడుతున్నాడు బాబా" అని ఆ కుఱ్ఱవాడనగా ఆ సాధువు, "బాబూ! ఇది మరీ నీచవిషయం-ఏమంటావా? అవేమీ నాకు తగలలేదు అన్నీ వాడి నోటిలోనే ఉండిపోయాయి. వాడి నోరే మలినమై పోతుంది" అన్నాడు.

ఆ తిట్లుతిట్టే కుఱ్ఱవాడు సాధువు సమాధానాలు ఆలకిస్తున్నాడు. వాడు ఆలోచించాడు "ఈ సాధువు సత్యమే చెబుతున్నాడు. ఎవరినైనా నేను దూషిస్తుంటే వారు నా తిట్లను స్వీకరించి నన్ను కొట్టుటకు పరుగులు తీస్తుంటారు. పరుగెత్తలేని వారైతే దుఃఖించేవారు. నా తిట్లను యీ సాధువు స్వీకరించక పోవడంవల్ల అవన్నీ నా దగ్గరే ఉండిపోయాయికదా! ఆ కుఱ్ఱవానికి ఆతని స్థితి చాలా నీచంగా అనిపించింది. ఛీ! ఛీ! నా దగ్గర అసహ్యకరమైన ఎన్ని తిట్లు ఉండిపోయాయో కదా" అని మనసులో అనుకున్నాడు.

చివరికి వాడు సాధువుకు దగ్గరగా వెళ్ళి "బాబాజీ! నా అపరాధాలు ఎలా విముక్తమవుతాయి? నా నోరు ఎలా శుద్ధమవుతుంది?" అని ప్రశ్నించాడు.

సాధువు శాంతంగా సమాధానం యిచ్చాడు. "పశ్చాత్తాపం చెందడం వల్లనూ, ముందెన్నడూ దూషించను అని ప్రతిజ్ఞ చేయడం వల్లనూ నీ అపరాధాలు దూరమవుతాయి. రామనామ స్మరణవల్ల నోరు శుద్ధమవుతుంది"

----oOo----

## 30. పెద్దల మాట విను

ఓ మహారణ్యం ఉంది. అందులో పర్వతాలున్నాయి. నిర్మల జలాలతో ప్రవహించే సెలయేరులున్నాయి. అక్కడ అసంఖ్యాకంగా ఎన్నో జంతువులున్నాయి. పర్వత గుహలో ఓ సింహము, ఓ సివంగి (ఆడ సింహము) దాని రెండు పిల్లలూ ఉన్నాయి. ఆ సింహపు జంట తమ పిల్లల్ని విశేషంగా ప్రేమిస్తున్నాయి.

పిల్లలతో కూడ ఆ సింహపు జంట అరణ్యంలో విహరిస్తుంటే అడవిలోని మిగిలిన జంతువులన్నీ వాటిని చూసి పారిపోయేవి. కాని, ఆ సింహపు జంట తమ పిల్లల్ని ఎక్కువగా తమతో అడవిలోకి తీసుకువెళ్ళేవి కావు. అవి తమ పిల్లల్ని గుహలో వదిలిపెట్టి ఆహారార్థం అడవిలోకి పోయేవి.

ఆ సింహపుజంట తమ బిడ్డలకు ఎన్నో పర్యాయాలు- ఒంటరిగా మీరు గుహను విడిచిపెట్టి పొరపాటునకూడ అడవిలోకి పోవద్దని చెబుతుండేవి. కానీ, పెద్దపిల్లకు తల్లిదండ్రుల మాటలు నచ్చేవికావు. ఓనాడు తల్లిదండ్రులు ఆహారార్థం అడవిలోకి వెళ్ళిపోయాక పెద్దది చిన్నదానితో "నడు సెలయేటిలో నీళ్ళు త్రాగి వద్దాము. కొంచెం సేపు

అడవిలో తిరుగుదాము, లేళ్ళనుభయపెట్టడమంటే నాకు చాలా సరదాగా ఉంటుంది" అంది.

అందుకు చిన్నది "నాన్నగారు మనల్ని గుహనుండి బయటకు పోవద్దన్నారు. ముఖ్యంగా సెలయేటి దగ్గరకు వెళ్ళడాన్ని వారు పూర్తిగా నిషేధించారు. ఆగు. అమ్మా, నాన్నా వచ్చాక మనం వారితో వెళ్ళి నీళ్ళు త్రాగుదాము" అంది.

మళ్ళీ పెద్దది ఆరంభించింది "నాకు చాలా దాహంగా ఉంది జంతువులన్నీ మనల్ని చూసి భయపడుతున్నాయి కదా! నీకు భయమెందుకు?".

చిన్నది ఒంటరిగా వెళ్ళడానికి అంగీకరించలేదు. అది ఇలా అంది "నేను అమ్మా నాన్నా చెప్పిన మాటలే వింటాను. నీతో రావడానికి నాకు చాలా భయం వేస్తుంది". అందుకు పెద్దది "పిరికిపందా! నువ్వు రానక్కర్లేదులే, నేనే వెడతాను" అంటూ అది గుహనుండి బయటకు వచ్చి సెలయేటి దగ్గరకు వచ్చి కడుపునిండా నీళ్ళు త్రాగింది. తరువాత లేళ్ళను అన్వేషిస్తూ అటూ యిటూ తిరగ సాగింది.

అదే రోజున వేట నిమిత్తం వేటగాళ్ళు కొందరు ఆ అరణ్యానికి వచ్చారు. సింహపు పిల్ల ఒంటరిగా తిరగడం చూశారు. దీనిని పట్టి జంతు ప్రదర్శన శాలకు అమ్మితే మనకు చాలా డబ్బు వస్తుంది. దాక్కుంటూ నెమ్మది నెమ్మదిగా వేటగాళ్ళు సింహపు పిల్లను నలువైపులా చుట్టు ముట్టారు. కంబళీలు, బట్టలూ దాని మీదకు విసిరి కప్పి పట్టేశారు.

పాపం ఆ సింహపు పిల్ల ఏమి చేయగలదు? అది యింకా పెద్దది కూడా కాలేదు. దానిని కంబళీలోనే త్రాళ్ళతో బంధించి వేశారు. అందులో అది గిలగిలలాడడానికి లేదు. గర్జించడానికీ లేదు. వేటగాళ్ళు దానిని ఓ మ్యూజియం వారికి అమ్మివేశారు. అది అక్కడ ఓ యినుపబోనులో బంధించబడింది. అది చాలా విచారంగా ఉంది. దానికి తన తల్లిదండ్రులు

ఎక్కువగా జ్ఞాపకానికి రాసాగారు. అది మాటి మాటికీ గర్జిస్తూ ఆ యినుప ఊచలను పెకలించ ప్రయత్నం చేయసాగింది. అవి దానికి లొంగుతాయా?

చిన్న పిల్లలెవరైనా ఆ సింహపు పిల్లను చూస్తే అది గర్జిస్తూ ఎగురుతూంటుంది.

ఎవరైనా దాని భాషను అర్థం చేసుకోగలిగితే- "మీరు మీ తల్లిదండ్రుల, పెద్దల మాటలను తప్పక వినాలి. పెద్దల మాట వినకపోతే తరువాత పశ్చాత్తాప పడి ప్రయోజనం ఉండదు. తల్లిదండ్రుల మాట వినకపోవడం వల్లనే నేనిక్కడ బంధించబడి ఉన్నాను". అని గ్రహించ గలుగుతారు.

-----oOo-----

## 31. స్వేచ్ఛత

ఓ రైతు ఓ పిల్లిని పెంచుతున్నాడు. తెల్లని మృదువైన రోమాలుగల ఆ పిల్లి రైతు మంచం దగ్గర కాళ్ళవైపున నిద్రపోతుంటుంది. పొలంనుండి ఆ రైతు యింటికి మరలి రావడం చూసి ఆ పిల్లి అతని దగ్గరకు పరుగెత్తుకు వెళ్ళి, అతని కాళ్ళను తన శరీరంతో రాస్తూ "మ్యావ్ మ్యావ్"మని తన ప్రేమను వ్యక్తం చేస్తూ ఉంటుంది. రైతు ఆ పిల్లికి కొంచెం రొట్టె, పాలు యిస్తూ ఉంటాడు.

ఓ నాడు సాయంకాలం రైతు కొడుకు, తండ్రితో- "నాన్నా ఈ రాత్రి నేను నీతో పరుంటాను" అన్నాడు.

"వీల్లేదు. నువ్వు వేరే మంచం మీద పరుండాలి" అన్నాడు తండ్రి.

"మీరు పిల్లిని మీ మంచం మీద కాళ్ళవైపు పరుండనిస్తున్నారు. నన్ను ఎందుకు పరుండ నీయరు?" అని ప్రశ్నించాడు.

"నీకు గజ్జి ఉంది. నా దగ్గర నువ్వు పరుంటే అది నాకు కూడ అంటుకుంటుంది కనుక నువ్వు ముందు నీ గజ్జి పోయేటట్లు చూసుకో" అన్నాడు రైతు.

గజ్జితో ఆరైతుబిడ్డ చాలా బాధ పడుతున్నాడు. వాడి శరీరమంతా చిన్న చిన్న గజ్జి పొక్కులు వ్యాపించాయి. దురదవల్ల అతడు మహా బాధపడుతున్నాడు. అతడు తన తండ్రినడిగాడు– "అసలు నాకు యీ గజ్జి ఎందుకు వచ్చింది, ఈ పిల్లికి ఎందుకు రాలేదు".

తండ్రి బదులు పలికాడు "ఈ విషయం నీకు నేను రేపు చెబుతాను".

మరునాడు రైతు రోజు కంటె ఎక్కువగా ఆ పిల్లికి పాలూ, రొట్టే యిచ్చాడు. కాని, కడుపు నిండగానే ఆ పిల్లి మిగిలిన రొట్టెను, పాలను విడిచి పెట్టి దూరంగా వెళ్ళిపోయింది. ఎండలో కూర్చుని మాటిమాటికీ తన ఓ కాలును నాకుతూ తన ముఖం మీద త్రిప్పసాగింది.

రైతు తన కొడుకును అక్కడకు పిలిచి "నాయనా! చూశావా ఈ పిల్లి తన ముఖాన్ని ఎలా శుభ్రం చేసుకుంటున్నదో, ఇదే విధంగా యిది తన శరీరాన్నంతటినీ శుభ్రంగా వుంచుకుంటుంది. అందుకే దీనికి గజ్జి పట్టదు. నువ్వు నీ బట్టలనూ, శరీరాన్నీ కూడా అపరిశుభ్రంగా ఉంచుకుంటావు. అందుకే నీకు గజ్జి పట్టుకుంది. మురికిలో ఓ విధమైన విషం ఉంటుంది. చెమటతోపాటు చర్మానికి సోకడంతో లోపలికి వెళ్ళగా గజ్జి, దురద, పొక్కులు మొదలైన అనేక వ్యాధులు బయలు దేరుతాయి.

పిల్లవాడు– "ఇవ్వాళ నేను నా బట్టలన్నీ వేడినీళ్ళలో నానబెట్టి ఉతుక్కుంటాను. చక్కగా స్నానం చేస్తాను. దీనివల్ల నా గజ్జిపోతుందా నాన్నగారూ?.

"శరీరంతో బాటు కడుపును కూడ శుభ్రంగా ఉంచుకోవాలి.

కడుపునిండడంతో పిల్లి పాలనుకూడ విడిచి పెట్టివేసింది. కడుపునిండాక మరే పదార్థం తీసుకోరాదు. కడుపులో ఆరాటాన్ని కలిగించే పదార్థాలను స్వీకరించకూడదు. పులుపు, కారం, బజారుసరుకులు ఎక్కువగా తీపి వస్తువులు తినరాదు. టీ, కాఫీలు త్రాగడం వల్ల ఉదర వ్యాధులు వస్తాయి. ఉదరం శుభ్రంగా ఉండకపోవడం వల్ల అనేక రోగాలు కలుగుతాయి. జ్వరం కూడ ఉదరం శుభ్రంగా లేకపోవడం వల్లనే వస్తుంది. జిహ్వాచాపల్యం కోసం ఆకలిలేక పోయినా అధికంగా తినేవారు, తీపిపదార్థాలు, నూనెలో వేయించిన వస్తువులు, పెరుగు, వీటిని మాటి మాటికీ తినేవారికి తామర, గజ్జి వంటి యింకా ఎన్నో రోగాలు వస్తాయి. ఉదరం శుభ్రంగా ఉండాలంటే తవుడు కలిపిన పిండితో తయరుచేసిన రొట్టే, ఆకుకూరలు, ఫలాలు విశేషంగా తినాలి" అన్నాడు తండ్రి.

నాటినుండీ ఆరైతుబిడ్డ తన బట్టలను స్వచ్ఛంగా ఉంచుకోసాగాడు. అతడు నిత్యం శరీరాన్ని బాగా రుద్దుకుని స్నానం చేయసాగాడు. అధికంగా తినకూడదనీ, ఉన్నా ఉదరంలో బాధను కలిగించే వస్తువులు ముట్టరాదనీ నిశ్చయించుకున్నాడు. దానితో వాని గజ్జి పూర్తిగా మటుమాయమై పోయింది. అతడు మంచి ఆరోగ్యవంతునిగా, బలవంతునిగా, ఉత్సాహవంతునిగా తయారయ్యాడు. అతని తండ్రి, యితరులు కూడ నాటినుండి ప్రేమగా అతణ్ణి దగ్గర కూర్చోబెట్టుకోసాగారు.

-----oOo-----

## 32. శ్రద్ధలేక సిద్ధిలేదు

ఇంగ్లీషు చదువుకున్న ఒక పెద్దమనిషి ఉండేవాడు. హేటు, సూటు, బూటు అన్నీ వేసేవాడు. ఎప్పుడూ ఇంగ్లీషే మాట్లాడుతుండేవాడు. నౌకర్లమీద కోపం వచ్చినప్పుడు ఇంగ్లీషులోనే, కుక్కపిల్ల మీద ప్రేమగల్గినా ఇంగ్లీషులోనే.

ఈ పెద్దమనిషికి ఒక కొడుకు ఉన్నాడు. దురదృష్టంకొద్ది వానికి

జబ్బుచేసింది. డాక్టరు వచ్చి చూచివెళ్ళాడు. ఇదే విధంగా ఒకరు, ఇద్దరు, ముగ్గరు నల్గురు డాక్టర్లు వచ్చారు. సూదిమందిచ్చి వెళ్ళారు. ఎంతోమంది వైద్యులకు చూపించి మందిప్పించారు. కాని, ఆ పిల్లవానికి జబ్బునయం కాలేదు. వాని జబ్బు రోజురోజుకు పెరుగుతున్నదిగాని తగ్గటం లేదు.

ఒకరోజు ఒక సాధువు వచ్చాడు. ఆంజనేయస్వామికి సింధూరం, లడ్లు, ప్రసాదం చేయించండి అదే తగ్గిపోతుంది అని సలహా ఇచ్చాడు.

ఆ పెద్దమనిషికి దేవునియందు విశ్వాసం లేదు. నేను రాతివిగ్రహాన్ని కేవలం రాయిగానే చూస్తాను. కాని, నీవు చెప్తున్నావుగాబట్టి సింధూరం, లడ్లు దేవునికి చూపించివస్తాను. కొడుకుజబ్బు తగ్గుతుందనే ఆశతో అలాగే చేసివచ్చాడు.

కాని, పిల్లవాడి జబ్బుమాత్రం తగ్గలేదు. మర్నాడు సాధువు వద్దకు వెళ్ళి "స్వామి పిల్లవాని జబ్బు తగ్గలేదు", అన్నాడు.

"ఆ సింధూరం, నేయి, మిఠాయి, పూలు, పళ్ళు, అగరుబత్తి నాకివ్వు. నేను వెళ్ళి సమర్పిస్తాను", అన్నాడు సాధువు.

సాధువు ఆంజనేయుని పూజచేసి సింధూరాన్ని పిల్లవాని నుదుటపెట్టాడు. పిల్లవాడు లేచి కూర్చున్నాడు. వాని జ్వరం తగ్గిపోయింది.

"నీవు చేసిన పూజవల్ల నాకొడుకు ఆరోగ్యవంతుడైనాడు. కాని, నాపూజవల్ల అలా ఎందుకు జరుగలేదు" అన్నాడు పెద్దమనిషి.

"అసలు నీవు పూజెక్కడ చేశావు"? "నేను పూజ చేశానే"?

"శ్రద్ధలేని పూజ ఎందుకు?" పూజ చేయనిదే జబ్బెలా నయమవుతుంది

----oOo----